ధనము పొదుపు కొరకు

# "ఉమా"

22. క్యారట్లు బంగారు రేకు
కవరింగు నగలనే కొనండి.

అనేక సంవత్సరములు
మన్నికగా యుండును.

UMA. 718.

UMA. 535.

UMA. 203.

UMA. 1071.

UMA. 506.

UMA. 819.

JASMIN NECKLACE.
Rs. 25/-

UMA. 70512.

UMA. 37.

జొత్తములు రు. 1/- కఫ్స్-జొత్తములు రు. 2/-

జత గాజులు— 2½ వైజు నం. 203 - జత రు. 14/40;

నం. 705/2 జింకీ - జత రు. 6/-;

నం. 37 కెంపోగులు జత రు. 2/-.

ఉమా గోల్డు కవరింగు వర్క్సు
H.O. ఉమా మహల్.. మచిలీపట్టణము. ఇండియా

ప్రొప్రయిటర్: టి. వి. సుబ్బయ్య

మా విక్రయ శాలలు

90, చైనాబజారు రోడ్డు, మద్రాసు_1

శివాలయం వీధి, విజయవాడ

104, కామధేను బిల్డింగు, ఎవెన్యూ రోడ్డు, బెంగుళూరు సిటీ

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ,
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.


చందమామ (అన్ని భాషలలో)
(విడి కాపీ **50** నయా పైసాలు. **8** అణాలు)
సాలు చందా రు. **6** లు.

# స్వచ్ఛందసేవకుని కీర్తి ప్రతిష్ఠలు...

... రమేష్ అప్రమత్తుడై కాపాడుకుంటూ వుంటాడు. పరిసరప్రాంతాలలో జరిగే అగ్ని ప్రమాదాలను నివారించడమేమి, అంధులను, అవిటివారిని ప్రమాదభరితమైనచోట్ల సురక్షితంగా రోడ్లను దాటించడమేమి — ఒకటేమిటి సర్వదా తన విద్యుక్తధర్మాన్ని నిర్వర్తిస్తూ, స్వచ్ఛంద సేవకుల కీర్తి ప్రతిష్ఠలను రమేష్ కాపాడుకుంటూ వుంటాడు. సాతేవారి కరకరలాడే కమ్మని బిస్కత్తులను తినడంవల్ల అలసట వుండదు సరికదా, రోజంతా చిరునవ్వులు వెదజల్లుతూ హుషారుగా వుంటాడు.




heros'-SBC-126 A TE

# సాతే బిస్కత్తులు

సాతె బిస్కట్ & ఛాకొలెట్ కంపెనీ లిమిటెడ్, పూనా-2.

# వైట్ హార్స్ సబ్బు




**WHITE HORSE SOAP**

. . . . గుడ్డల మురికిని పోగొట్టుటలో
అగ్రస్థానము వహించినది.
పట్టు, లినన్ గుడ్డల చలువకు శ్రేష్ఠమైనది.

బారు ఒకటి: రు. 1-00
పెద్ద సైజు కేకు: 0-31 న. పై.
మీడియం సైజు: 0-19 న. పై.
శాంపిల్ సైజు: 0-07 న. పై.

తయారుచేయువారు:
## నేషనల్ ఇండస్ట్రీస్,
మదరాసు - 21

---

మృదువైన చర్మమునకు

## ఫెస్టివల్
## సూపర్ సాండల్ టాల్కం పౌడర్
అండు
## స్నో






ఫోన్: 2788 — మురళి ట్రేడర్స్ మదరాసు-21 — తంతి: "Mursoks"

ప్రతిచోటా దొరకును
ఆంధ్ర ప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్లు
## M/s. శివకోటి లక్ష్మినరశింహం,
మార్కెట్ స్క్వేయర్ :: విజయవాడ

## 'చందమామ' కు

★

ఏజంట్లు లేని ప్రతి ఊరిలోనూ చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్దికాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 3-0-0 పంపుతూవుంటే మీకు 8 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా 1-0-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు వ్రాయండి.

★

చందమామ పబ్లికేషన్సు,
వడపళని, మద్రాసు - 26

# పాఠకుల లేఖలు

## సెప్టెంబర్ 1961

"చందమామ" నా చిన్నతనంనాటి తీయటి స్మృతుల్ని జ్ఞాపకం చేసింది. నేటి సంచికలో "సైమన్," "గంగాస్నాన ఫలం," బేతాళ కథ, "రాకాసిలోయ" సీరియల్ కూడా నన్నెంతో ఆకర్షించి ఆనంద పరిచాయి.

—శాశిన మల్లేశ్వర.రావు, జడ్చెర్ల

పిల్లలకు, పెద్దలకు కూడా యింత ఆనందము కలుగ జేస్తున్నందుకు "చందమామ"ను ఎలా అభినందించాలో తెలియుట లేదు.

—ఇ. సరోజినీదేవి, రాజమండ్రి

"చందమామ"లో బొమ్మలు చూస్తూ కథలు చదువుతుంటే చాలా బాగా అర్థ మవుతున్నాయి. సినిమా చూస్తూ కథ అర్థం చేసుకుంటున్నట్లుంది.

—ఎస్. వెంకటనారాయణ, కమలాపురం

మా అభిమాన పత్రిక "చందమామ" ఒక్కటే అని జంకు లేకుండ చెప్పవచ్చును.

—షేక్‌కరీం అహ్మద్ షరీఫ్, గోపాలపురం

మామా! మరే—మరి నువ్వు నెల నెలా చక్కగా ముస్తాబయి వస్తావు. నేను నిన్ను ఎట్లున్నా గుర్తు పట్టగలను! శలవు, మామా.

—ఎం. విశ్వేశ్వరి, కర్నూలు

అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ అమోఘముగా నున్నవి. —ఎస్. అంజయ్య, కలివేముల

ఈ నెల ముఖచిత్రం "చందమామ"కు ఒక ప్రత్యేకత చేకూర్చింది.

—రాజేశ్వరరావు ఆదిభట్ల, విజయనగరం

ముఖచిత్రంలో నున్న రామలక్ష్మణుల బొమ్మలు నిజంగా రామలక్ష్మణులు నిలబడివున్నారా అని సందేహపడునట్టుగా చిత్రించారు

—పి. టి. శ్రీనివాసు, భీమవరం

ఈ నెల "చందమామ" ముఖచిత్రం ముచ్చటను. అట్టచివరి బొమ్మ అహ్లాదాన్ని కలిగించింది. "చిత్రా"గారి విచిత్రమైన చిత్రాలు బాగున్నాయి.

—కె. పద్మ, అలువాల

గత రెండు మాసాలకంటె ఈ నెల అట్టమీది బొమ్మ చాలా బాగుంది.

—ఏ. సుబ్బారావు, అనంతపూరు

"దక్షయజ్ఞం" గేయకథ "చందమామ"కు మణిపూస. "రాకాసిలోయ," "బాలకాండ" వంటి కథలు "చందమామ" శోభను ద్విగుణీకృతం చేస్తున్నాయి.

—పెదగాడ సాంబశివరావు, దేవరయాంజాల

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యగారి గేయకథ దిన దిన వృద్ధి పొందుతున్నది.

—ఎస్. నారాయణ్, కమాన్‌పురం

"బాలకాండ," "రాకాసిలోయలు" చాలా బాగున్నవి. "బీదవాడి అదృష్టం" నాకు చాలా నచ్చింది. ఇంత మంచి కథలు ప్రచురిస్తున్నందుకు నేను చాలా కృతజ్ఞురాలిని.

—సి. వి. రుక్మిణి, మచిలీపట్నము

"రాకాసిలోయ," "గంగాస్నాన ఫలం," "జవాబు లేని ప్రశ్న" చదివి ఆనందించాను.

—డి. రమణయ్య, నిజామాబాద్

"రాకాసిలోయ"లో బ్రహ్మపుర సేనానికి జరిగిన శాస్తి చాలా బాగుంది.

—యం. రాజశేఖర్, హైద్రాబాద్

ఈ సారి "చందమామ"లో అన్ని కథలు బాగున్నాయి. ముఖ్యంగా "సైమన్," "రాకాసిలోయ" చాలా బాగున్నవి

—బారు నరహరిరావు, హైద్రాబాద్




'ఇట్టి కొంటె బాలుని చక్కగా పోషించాలంటే మీకు చేతినిండా పనివుండాలి ... అనగా అతనిని మీరు పరిశుభ్రంగాను, సొగసుగాను వుంచుటకు మళ్లీ మళ్లీ బట్టలుతుకుతుండాలి.'
ఇంకా నయం, సన్‌లైట్ నన్ను కాపాడుతున్నది. దాని సమృద్ధయిన నురగ అతని బట్టలను బాగా శుభ్రపరుస్తుంది, మళ్లీ మళ్లీ వుతుకులలో ఏమాత్రమూ శ్రమలేదు. శుద్ధమైన సబ్బు లక్షణం అదే.

న్యూఢిల్లీ యందు భగత్ సింగ్ మార్కెట్ లోగల ప్లాట్ 54 యందున్న శ్రీమతి. కమల వాద్వాని ఇలా చెప్పు తున్నది. 'బట్టలుతుకుటకు సన్‌లైట్ వంటి సబ్బు మరేదీ లేదు.

# సన్‌లైట్




*మీ బట్టలకు వరప్రసాదం!*

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

S.31-X29 TL

# తరచుగా వచ్చే దగ్గు మరియు రొంప ఓపికను తగ్గిస్తాయి... శ్వాసనాళములకు కలిగే అంటువ్యాధులను అడ్డే శక్తిని తగ్గిస్తాయి

దగ్గు మరియు రొంప బాధను కలిగించడమే కాకుండా అవి తరచుగా వస్తూంటే వాటిని గురించి బెంగ పెట్టుకోవలసి వస్తుంది. వాటర్ బరీస్ కాంపౌండ్‌ను త్రాగుట వెంటనే ప్రారంభించండి.



వాటర్ బరీస్ కాంపౌండ్

- ★ దగ్గు నుండి మరియు శ్వాస నాళములు పూడుకొని పోవుట నుండి స్వస్థత కలిగిస్తుంది.
- ★ దగ్గు, జలుబులను ఎదుర్కొనే శక్తిని పెంపొందిచును.
- ★ ఆహారము ఒంట పట్టుటలో సహకరిస్తుంది.
- ★ శరీరములోని అన్ని అవయవములకూ శక్తినిచ్చును




క్రిసోట్ మరియు గైకాల్‌తో పుష్టికరము చేయబడిన వాటర్ బరీస్ కాంపౌండ్ శ్వాసనాళములు పూడుకొని పోవుటను మరియు చాల కాలము నుండి బాధపెడుతున్న దగ్గు మరియు రొంపను పోగొట్టును. మీ ఒంట్లో ఆరోగ్యమును క్రమపరచి వ్యాధులు రాకుండా చేయుటయే కాక మీరు సంవత్సరము పొడుగునా శక్తి, ఉత్సాహములతో పని చేయుటలో సహకరిస్తుంది. పిన్నా పెద్దా అందరికీ బాగుగా గుణము కలిగిస్తుంది.

మంచి రుచిగల దీనిని - త్రాగండి

## వాటర్‌బరీస్ కాంపౌండ్

(ఎఱ్ఱ లేబిలు)

మీకు శక్తి ఉత్సాహములు యిస్తుంది



ఈ రకముది కూడ లభిస్తోంది : కేసరి రంగు లేబిలుగల వాటర్ బరీస్ విటమిన్ కాంపౌండ్. ఇది అన్ని విధములా వాడదగిన టానిక్‌గా సిఫార్సుచేయబడినది

వార్నర్ - లేంబర్ట్ ఫార్మస్యూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ. లో స్థాపింపబడినది)

W-161


LIFEBUOY
SOAP
LIFEBUOY SOAP



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

జూలై సంచిక జన్మదిన ప్రత్యేక సంచికగా రానందుకు కొందరు పాఠకులు నిరాశ చెందినట్టుగా కనిపించారు. కాని కాగితం పరిస్థితి ఏమీ బాగాలేదు. మీ "చందమామ" ప్రత్యేకంగా దిగుమతి అయే విదేశీ కాగితం మీద అచ్చు అవుతున్నదని జ్ఞాపకం ఉంచుకోండి.

ఇంకొక సంగతికూడా మీరు మరువకూడదు. ఉన్న సౌకర్యాలలో ఏలోటూ జరగకుండా పాఠకులను అన్ని విధాలా తృప్తిపరచడానికే "చందమామ" మొదటినుంచీ యత్నిస్తున్నది. కథలు ఎన్నుకోవటంలోనూ, వాటికి బొమ్మలు తయారు చేయించటంలోనూ, వాటిని అచ్చు వేయించటంలోనూ ఎంతో శ్రద్ధ వహిస్తున్నాము.

అన్నట్టు ఇకనుంచీ "చందమామ" అట్టల మీది బొమ్మలు "ఫొటో గ్రావ్యూర్"లో అచ్చవుతున్నాయి. ఈ అచ్చు పూర్వంకంటె ఆకర్షవంతంగా ఉంటుంది. ఈ మార్పు పాఠకులను ఆకర్షిస్తుందని ఆశిస్తాము.

సంపుటి 29 : సెప్టెంబర్ 1961 : సంచిక 3



# సందేహ నివృత్తి

గుండు భీమన్న ఉండే గ్రామంలోనే ఒక శ్రీమంతు డుండేవాడు. ఆయన భోజన ప్రియుడు. బోలెడంత డబ్బు ఉన్నది. సంసారం ఏమీ లేదు. అందుచేత ఆయన వంటవాణ్ణి ఒకణ్ణి పెట్టుకుని వాడిచేత రుచి రుచిగా భోజనమూ, ఫలహారాలూ చేయించుకునేవాడు. మూడు పూటలా మస్తుగా తినటమూ, నిద్రపోవటమూ తప్ప ఆయనకు మరొక పనిలేదు.

త్వరలోనే శ్రీమంతుడి వద్ద వంట చేసే వాడికి కూడా తిండి జాస్తి అయి, శరీరం కొవ్వి, సోమరితనం అలవడింది. అందుచేత వాడు తన కింద పనిచేయటానికి మరొక మనిషిని పెట్టుకోవాలని నిశ్చయించాడు.

ఒకనాడు వాడు బామ్మ యింటికి వచ్చి, "ఏమమ్మా, నేను ఫలాని వారింట వంట చేస్తూ ఉంటాను. పై పనులు చెయ్యటానికి కుర్రవాడు కావాలి. మీ ఇంటో ఎవరో ఉన్నాడని చెప్పారు. పనిలోకి వస్తాడా ఏమిటి?" అని అడిగాడు.

బామ్మ గుండు భీమన్నను పిలిచి, "శ్రీమంతుల ఇంట పై పనులు చెయ్యటానికి పోతావుట్రా?" అని అడిగింది. గుండు భీమన్న సరే నన్నాడు. వంటవాడు వాణ్ణి తన వెంట తీసుకుపోయాడు.

శ్రీమంతుడు మధ్యానం భోజనం చేయగానే పడుకుని నిద్రపోతాడు. మూడు గంటలయేసరికి ఆయనకు ఫలహారం సిద్ధమవుతుంది. వంటవాడు ఫలహారం తెచ్చి మంచం పక్కన పెడితే ఆయన నిద్రలేచి, ఫలహారం చేసి, మళ్ళీ నిద్రపోతాడు.

ఒక్కొక్కసారి ఆయన మరికొంత సేపటికి లేచి, "నా ఫలహరమూ, పాలూ ఏవిరా?" అని కేక వేస్తాడు. ఎందుకంటే నిద్రమత్తున చేసిన ఫలహారం కావటంచేత ఆయన కది జ్ఞాపకం ఉండదు.

"అప్పుడే తీసుకున్నారు గదండీ?" అంటాడు వంటవాడు. ఆయన తిన్న ఎంగిలి పళ్ళాలూ, పాల లోటా చూపించినాక గాని శ్రీమంతుడికి నమ్మకం కలగదు.

యజమానికి ఇలాటి అలవాటు ఉండటం చేత వంటవాడు ఆయన ఎంగిలి పళ్లాలూ, లోటా మంచం పక్కనే ఉండనిచ్చేవాడు.

ఇలా కొంతకాలం గడిచాక వంటవాడి కొక దుర్బుద్ధి పుట్టింది. వాడికి కూడా క్రమంగా ఒళ్ళు బరువు హెచ్చుతూ ఉండటం చేత ఒక్కొక్క రోజు ఫలహారం చెయ్యటానికి ఒళ్ళు వంగేదికాదు. అటు వంటప్పుడు వాడు కొన్ని ఎంగిలి పళ్ళాలూ, లోటా తయారుచేసి యజమాని మంచం పక్కన పెట్టేసి, యజమాని మూతికి కొంచెం చక్కెరా నెయ్యీకలిపి రాచి మాట్లాడకుండా ఊరుకునేవాడు.

యజమాని లేచి, "ఫలహారమూ, పాలూ ఏవిరా?" అని అడిగితే, "అప్పుడే ఫల హారం చేశారుగదండీ?" అని వంటవాడు జవాబు చెప్పేవాడు. యజమాని ఎంగిలి పళ్ళాలు చూసి పెదవులు నాక్కుని, నిజమే కాబోలు నని మళ్ళీ నిద్రపోయేవాడు.

గుండు భీమన్న నౌకరీలోకి వచ్చిన రోజున వంటవాడు ఫలహారం చెయ్యటానికి



బద్ధకించాడు. వాడు కొన్ని ఎంగిలి పళ్లాలూ, లోటా తయారుచేసి భీమన్నతో, "ఈ పళ్ళాలూ, లోటా యజమాని మంచం పక్కన పెట్టు. ఈ చక్కెరా నెయ్యీ తీసుకుపోయి యజమాని పెదవుల పైన రాయి. ఆయన గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. లేవడులే, భయంలేదు," అన్నాడు.

"సరే నండి," అని భీమన్న పళ్ళాలూ లోటా పట్టుకుపోయి యజమాని మంచం పక్కన పొట్టిబల్ల మీద ఉంచాడు. కాని నెయ్యీ చక్కెరా ఎలా రాయాలో వాడికి తెలియలేదు. యజమాని పెదవుల పైన రాయమంటాడు వంటవాడు. పెదవుల పైన

మీసాలున్నాయి. మీసాలపైన ముక్కున్నది. మీసాలకు రాయాలా, ముక్కుకు రాయాలా? వంటింటోకి వెళ్ళి అడిగితే వంటవాడికి కోపం వస్తుందేమో!

అందుకని భీమన్న యజమానిని తట్టి నిద్రలేపి, "అయ్యా, దీన్ని మీ పెదవులపైన రాయమన్నాడు వంటవాడు. మీసాలకు రాయమన్నారా? ముక్కుకు రాయమన్నారా?" అని అడిగాడు.

యజమాని నిద్రమత్తునుంచి లేచి, "ఏమిట్రా రాచేదీ? నా ఫలహారం ఎక్కడరా?" అని అడిగాడు.

"ఫలహారం లేదయ్యా! అందుకే ఈ ఎంగిలి పళ్ళాలూ, లోటా తయారుచేసి మీ మంచం దగ్గిర పెట్టాను. ఈ నెయ్యీ చక్కెరా మీ పెదవులపైన రాయమన్నాడు వంటాయన. పెదవుల పైననేమో మీకు మీసాలున్నాయి. దానికి పైన ముక్కున్నది. దీన్ని మీసాలకు రాయాలో, ముక్కుకు రాయాలో తెలీక తమరినే అడుగుదామని లేపాను," అన్నాడు భీమన్న.

"ఇదంతా ఏమిటి? నాకు కొంచెం కూడా అర్థం కావటంలేదు. ఫలహారం చెయ్యకపోవట మేమిటి? ఎంగిలి పళ్లాలు తెచ్చి మంచం పక్కన పెట్టట మేమిటి?" అని యజమాని చిరాకుపడి అడిగాడు.

"అయ్యా, తమరు నిద్ర లేచి ఫలహారం తెమ్మంటే ఇవి చూపించి, తమరు ఫలహారం చేశారని వంటాయన చెప్పమన్నాడండి," అన్నాడు భీమన్న.

వంటవాడు తనను ఈ విధంగా తరుచు మోసగిస్తున్నాడని యజమానికి స్పష్టంగా తెలిసిపోయింది. అయన వంటవాణ్ణీ, గుండు భీమన్ననుకూడా నానా తిట్లూ తిట్టాడు. తరవాత వంటవాడు గుండు భీమన్నను బాగా తన్ని పనిలోనుంచి వెళ్ళగొట్టాడు. గుండు భీమన్న తన దౌర్భాగ్యాన్ని తిట్టుకుంటూ ఇంటికి వెళ్లిపోయాడు.





# దక్షయాగ ధ్వంసము

తృతీయాశ్వాసము :

అదిగొ! దక్షుని యజ్ఞవాటిక :
ఆహుతుల పొగలవ్వె ముసరెను ;
అంత దూరములోనె సతి వా,
హనము దిగి మెలమెల్ల వచ్చెను.

ముని జనమ్ములు, సిద్ధసాధ్యులు,
మూడు కోటుల వేల్పు లచ్చట
ప్రోగుపడి కూర్చుండి యుండిరి,
యాగమును తిలకించుచుండిరి.

ప్రమథులు వెనువెంట నడువ,
పరమశివుని సహధర్మిణి
యాగశాల నడుగుపెట్టె—
యజమానికి అడలు పుట్టె.

దక్షుడు ఏమనునో యని
తాపసులా సతిని చూచి
లేచి లేవనట్లుండిరి,
చూచి చూడనట్లుండిరి.

సభయందలి వా రెవ్వరు
సతి సేమం బడుగ లేదు ;
పరిచితులగువారు గూడ
పలుకరించనైన లేదు.

శివుని మాట ఈబిడ పెడ
చెవినిపెట్టి వచ్చిన దని,
పిలువని పేరంటమునకు
పేరటాలు వచ్చినదని,

సతిని చూడనట్లు చూచి
సభయందలి జనులెల్లరు
గుసగుసలాడిరి కొందఱు,
రొసరొసలాడిరి కొందఱు.

అంత లోన తల్లి వచ్చి
అమ్మాయిని కౌగిలించె ;
తల్లి కనుల జలధారలు
తడిపె కూతు శీర్షమ్మును !

ఉత్పల సత్యనారాయణాచార్య



దక్షుడు కను లెఱ్ఱజేసి
తన భార్యను చూచినాడు ;
కూతురు కౌగిలిని వీడి
భీతిల్లుచు ఆమె తొలగె.

అక్కాయని చెల్లెండ్రును
అక్కున గదియించుకొనిరి ;
కొఱకొఱ మని దక్షుడపుడు
కూతుండ్రను చూచినాడు.

తండ్రిని గని దాక్షాయణి
దగ్గఱ కరుదెంచిన యది ;
చేతులెత్తి భక్తి తోడ
జోతలు గావించిన యది.

పెడ మొగమై దక్షు డపుడు
పిల్లను పరికించ లేదు ;
పిలిచి నప్పటికి నాతడు
పలుకనైన పలుక లేదు.

పదుగురు గుజగుజ వోయిరి ;
ప్రమథులు తల వంచుకొనిరి ;
ఆత్తఱి సతి గుండెలలో
కత్తి దూసినటులాయెను.

శివుని మాట ఎత్తకుండ
సవన మేదొ జరుగుచుండె ;
వింతగనా మంత్రములను
వినగ నామె ఒడలు మండె.

తన నాథుని పరిభవించు
తప్పిదమే కాకుండగ
కోరి వచ్చినట్టి తనకు
తీరని యవమాన మొదవె.

రుద్రుని సతి తండ్రి వంక
రోషముతో చూచినయది ;
అప్పటికిని దక్షుండును
అవ్వలి మొగమై యుండెను.

"తండ్రీ! మీ అల్లునిపై
తగని కోప మేల మీకు?
శివుడు లేని యజ్ఞమిట్లు
చేసిన ఫలమేమి కలుగు?"



అని యడిగిన కూతును గని
కను లెఱ్ఱగజేసి యతడు,
"చాలు చాలు, నీ మాటలు
చాతుర్యము కట్టిపెట్టు.

సిగ్గులేక యజ్ఞమునకు
శివుని నేను పిలువవలెన?
శుచి శుభ్రము లేని ఊర-
జోగిని పిలిపించ వలెన?

చాలిక మాటాడ కొక్క
మూలను పడియుండు," మనగ
ప్రమథులపుడు భీకరముగ
పైకెత్తిరి శూలమ్ములు.

ప్రమథగణము నాపి యామె
పలికె నపుడు నిర్భయముగ,
మహిషాసురు మర్దించిన
మాహేశ్వరి చందమ్ముగ-

"ఓ పాపీ!" యని యఱచెను.
ఉలికి పడిరి జనులెల్లరు;
గుప్పిట ప్రాణా లిడుకొని
కూర్చుండిరి మునులెల్లరు!

"పరమేశుని దూషించిన
పాపి నాల్క కోయుదగును;
తండ్రివగుట నిన్నిప్పుడు
దండింపక సైరించితి.

ప్రజాపతులలోన నేను
ప్రముఖుడనను గర్వముతో
పరమేశుని దూషించిన
పామరుడవు పాతకుడవు.

నీకు కూతు నగుటకంటె
నిప్పులలో దూకు టొప్పు-
నీ యజ్ఞము ధ్వంసమగుత!
నీ గర్వము నాశ మగుత!"

అని శపించి దాక్షాయణి
తన భర్తను తలచుకొనుచు
ఉత్తర దిశ కభి ముఖముగ
యోగమ్మున కూర్చుండెను.

లోలోపలి కోపాగ్నులు
జ్వాలలుగా లేచె నపుడు;
చిగురాకులతో వెలసిన
చెట్టుగ సతి తోచె నపుడు!

చుఱ చుఱ మని లక్క బొమ్మ
చుట్టు ముట్టి కాలు నట్లు,
అగ్నిహోత్ర శిఖలలోన
ఆహుతియై పోయె నామె.

స్వాహా యని వేల్చువారు
హాహా రవములు చేసిరి;
అయ్యో యని జనులెల్లరు
అఱచుచు విలవిలపోయిరి.

దక్షుడేడి యని ప్రమథులు
తామసమున లేచినారు;
అతని నిపుడె చంపెదమని
ఆయుధముల నెత్తినారు.

నేనే దక్షుడ నంచును
నిల్చినాడు భృగు మహర్షి;
దక్షుడపుడు పిల్లివోలె
దాగుకొనెను అతని చెంత.

భృగు మహర్షిపై ప్రమథులు
భీకరముగ వచ్చి పడిరి;
ఆ మహర్షి తక్షణ మొక
హోమమును గావించినాడు.

అగ్నికుండమం దప్పుడు
అవతరించె భృగుసేనలు;
భగభగమను కొఱవులతో
బయలుదేరె వేనవేలు.

భృగుసేనలు ప్రమథులపై
ఎగసి ఎగసి పేర్చెనపుడు;
ఒక్కంతట యజ్ఞశాల
యుద్ధశాల యయ్యెనపుడు

శివభటు లెల్లరు వెఱచుచు
చెల్లా చెదరై పోయిరి;
'నారాయణ' యనుచు లేచి
నారద ముని పరుగెత్తెను. –(సశేషం)






## 3

[కేశవుడి ఆలమందలోకి వచ్చిన వింత జంతువు బ్రహ్మపుర సేనానినీ వెంటవున్న భటుల్లో ఒకణ్ణీ చంపింది. బతికి బయటపడిన రెండో భటుడు నగరానికి పారిపోయాడు. నగరంలో రకరకాల పుకార్లు బయలుదేరినై. ఈ వార్తలన్నీ విన్న కేశవుడి ముసలి తండ్రి అరణ్యానికి వచ్చి కొడుకుతో ఆ సంగతులన్నీ చెప్పాడు. తరవాత—]

తండ్రి మాటలు వింటూనే కేశవుడు ఉలిక్కిపడ్డాడు. అతడు అంతదూరంలో మేస్తూవున్న వింతజంతువు కేసి ఆశ్చర్యంగా చూస్తూ, "అయ్యో, ఇప్పుడు అంతా అర్థమైంది. రాత్రి నేను చెప్పిన వింతజంతువు యిదే! దాని కొమ్ము కేసి చూడు, ఎంత నెత్తురు గడ్డకట్టి వున్నదో!" అన్నాడు.

ముసలివాడు కొడుకుతో మాట్లాడే హడావుడిలో యింతవరకూ ఆ వింతజంతువు కేసి చూడలేదు. ఇప్పుడు అతడి దృష్టి దాని మీద పడింది. అతడు నివ్వెరపోయాడు. కేశవుడు తండ్రిని దాని దగ్గిరకు తీసుకుపోయి, దాని కొమ్ము కేసి వేలు చూపుతూ, "చూశావా, నెత్తురు! ముఖాసకూడా... ఇదుగో ఇక్కడా...ఇక్కడా—ఇవి నెత్తురు మరకలు!" అన్నాడు.

"అయితే నగరంలో పుట్టిన పుకారు అబద్ధంకాదు. ఇది సేనానాయకుణ్ణీ, వెంటవున్న భటుణ్ణీ పొడిచి చంపింది. రాజభటులు అరణ్యానికి వస్తున్నారు. నువ్వు




మారువేషంలోవున్న శత్రుదేశపు గూఢచారి వని ఎవరో ఒక నీలివార్త వేశారు. భటుల వల్ల నీకు అపాయం తప్పదు," అన్నాడు ముసలివాడు నిస్పృహగా.

"ఇందులో నా నేరం ఏమీలేదు. సేనానాయకుడు కోరి కొరివితో తల గోక్కున్నాడు. ఈ వింతజంతువును బలవంతంగా మెడకు ఉచ్చువేసి పట్టుకుపోయాడు. బహుశా అది వాణ్ణి చంపి తిరిగి యిక్కడికి పారిపోయి వచ్చివుంటుంది. కొమ్ము నుంచి ఓడుతున్న నెత్తురుతో అది తిరిగిరావటం చూస్తూనే, ఏదో ప్రమాదం జరిగిందనుకున్నాను," అన్నాడు కేశవుడు.



"సరే, తప్పు ఎవరిదైతేనేం? రాజభటులు వస్తే మనకు ముప్పు తప్పదు. నువ్వు ఎటైనా పారిపో. ఇదుగో కత్తి. ని తాత చనిపోయినప్పటి నుంచీ యిది గోడకు వేలాడుతున్నది. ఇదీ, ని దగ్గిర వున్న బాణాలూ, నీ ఆత్మరక్షణకు వుపయోగిస్తవి. రాజభటులకు బందీగా చిక్కి అవమానం పాలయేకన్న, ఆత్మరక్షణ చేసుకుంటూ అవసరమైతే ప్రాణాలు వదలటం ఉత్తమం!" అన్నాడు తండ్రి.

కేశవుడు తండ్రి దగ్గిర నుంచి కత్తి తీసుకుంటూ, "ని మాటేమిటి?" అని ప్రశ్నించాడు.

"నా మాటకేం? నా రక్షణ నేను చూసుకోగలను. కాకపోయినా ముసలివాణ్ణి, వెయ్యేళ్లు బతకపోవటంలేదు గదా. నేనూ, రాజభటుల కంట పడకుండా దాక్కుంటాను. ఆలమందను అరణ్యం మధ్యకు తరిమేస్తాను. అవీ వాళ్ల కంటపడకూడదు," అన్నాడు ముసలివాడు.

వాళ్లిద్దరూ యిలా మాట్లాడుకుంటూ వుండగా, అరణ్యంలో ఎక్కడో గుర్రాలూ, మనుషులూ కదులుతున్న కలకలం వినబడింది. ముసలివాడు కొడుకుకేసి అదుర్దాగా చూశాడు. కేశవుడు చప్పున వింతజంతువు

దగ్గిరకు వెళ్లి దాని జూలు పట్టుకుని, "నేను రాజభటుల చేతచిక్కకుండా పారిపోవా లంటే, దీని మీద ఎక్కి సవారీ చేయుక తప్పదు. నా దగ్గిర ఎందుకనో యిది చాలా సాధువుగా ప్రవర్తిస్తున్నది," అంటూ ఎగిరి దానిమీద కూచున్నాడు.

వింతజంతువు కళ్ళు ఆవేలాగా మెరిసినై. "ఊఁ పరిగెత్తు. నీ యిష్టం వచ్చిన ప్రదేశానికి నన్ను తీసుకుపో," అంటూ కేశవుడు దాని జూలు పట్టుకుని లాగి, ఘడమల్తో డొక్కలో గట్టిగా పొడిచాడు. అది తుఫాను వేగంతో కొండకేసి పరిగెత్తసాగింది.




వింత జంతువు వేగానికి కేశవుడు భయ పడి పోయాడు. తను ఎక్కడ పట్టుతప్పి కొండ రాళ్ళ మీద పడి తునాతునియలై పోతానో అని అతడు కంగారుపడసాగాడు. వింత జంతువు పక్షిలా ఒక రాతిమీది నుంచి ఇంకొక రాతి మీదికి ఎగురుతూ కేశవుణ్ణి కొండ శిఖరానికేసి తీసుకు పోసాగింది.

ఆ కొండ ప్రదేశమంతా మహా భయం కరంగావున్నది. కొండమీద పొదలూ, పెద్ద పెద్ద చెట్లూ, గుహలూ—వాటిమీద కారా డుతూ తిరిగే చిరతపులులూ, ఎలుగు బంట్లూ, మహా సర్పాలూ—వీటిని చూస్తూనే కేశవుడు తన ప్రాణాలమీద ఆశ వదులు కున్నాడు. ఈ క్రూరజంతువుల బారినబడి దిక్కులేని చావు చచ్చేకన్న, బ్రహ్మపుర సైనికులకు చిక్కి కారాగారంలో మగ్గించటం అతడికి సుఖంగా వుండేటట్టు కనబడింది.

"ఈ వింత జంతువు నన్ను మోసం చేసింది!" అను కున్నాడు కేశవుడు. కాని అంతలోనే అతడికి జంతువు మోసంచేయుట మేమిటా అన్న సంశయం కలిగింది. తన తండ్రి చెప్పినట్టు యిదేమైనా మాయా రక్కసేమో అనుకున్నాడు కేశవుడు. ఏది ఏమైనా తను యిప్పుడు చేయగలిగిందేమీ లేదు. వింత జంతువు తనను ఎక్కడికి



తీసుకుపోతే అక్కడికి వెళ్ళవలిసిందే. తన చేతిలోవున్న కత్తితో దాన్ని అప్పటికప్పుడు మెడనరికి చంపినా, తను క్రూరమృగాల మధ్య వుండిపోవలసి వస్తుంది. వాటినుంచి ప్రాణాలతో బయటపడటం అసాధ్యం.

కేశవుడు యిలాంటి భయాందోళనలతో వుక్కిరి బిక్కిరవుతుండగా, వింత జంతువు ఒక ఎత్తయిన రాతిమీది నుంచి పల్లం లోకి దూకి, ఎదురుగావున్న గుహ ముందు చప్పున ఆగి పెద్దగా సకిలించింది. ఆ వెంటనే చీకటి గుయ్యారంగావున్న గుహలో మినుకు మినుకుమంటూ చిన్న కాంతి కనబడి, అంతలో పెద్ద కాగడా వెలుగూ, నల్లని పొగా...హాం ఔం ఫట్ భట్ హుం అన్న భీకరమైన గొంతూ వినిపించింది. కేశవుడు నిలువెల్లా వణికి పోయాడు. మరుక్షణంలో అతడు ఒరనుంచి కత్తిదూసి, వింత జంతువు మీది నుంచి కిందికి దూకాడు.

గుహ మళ్ళీ ఎప్పటిలా చీకటి మయమై పోయింది. వెలుగూ, పొగా మటుమాయ మయినై. మంత్రం పఠిస్తున్న గొంతుకూడా ఆగి పోయింది. అంతా నిశ్శబ్దం. ఈ వింత మార్పు కేశవుణ్ణి ఆశ్చర్యపరిచింది. గుహలో ఎవడోవున్నాడు, వాడు రాక్షసుడు కావచ్చు, మాంత్రికుడు కావచ్చు లేక నరమాంస భక్షకుడైన అడివిమనిషి కావచ్చు!

కేశవుడు ఒక్క తృటికాలంలో ఓ నిర్ణ యానికి వచ్చాడు. గుహలోవున్న వాణ్ణి తను చీకటివల్ల చూడలేక పోయాడు గాని, వాడు వెలుగులో వున్న తనను చూసి వుంటాడు. తనను సునాయాసంగా పట్టు కునేందుకు వాడేదో పన్నాగం వేస్తున్నాడనే దాంట్లో సందేహం లేదు. కనక తను సాధ్య మైనంత వేగంగా అక్కణ్ణించి పారిపోవాలి. కేశవుడు యిలా అనుకుంటూనే వింత జంతువు కోసం చూశాడు. కాని అది అతడికి అందుబాటులో లేదు. అల్లంతదూరాన ఒక రాతి నానుకుని నిలబడి, ఎదురుగావున్న



మరోబండరాయిని కొమ్ముతో కుమ్ముతున్నది. కేశవుడు ఒక్క పరుగున వెళ్ళి దానిని పట్టుకునేందుకు ముందుకు దూకాడు. కాని కేశవుడు సమీపించేలోపల వింత జంతువు ఛెంగున ఎగిరి బండరాయి మీద నిలబడింది.

కేశవుడిలో కలిగిన నిరాశ అంతాయింతా కాదు. సరిగ్గా ప్రాణాపాయం కలిగే సమయంలో వింత జంతువు తనకు అందకుండా పోయింది. కాలినడకను అక్కణ్ణించి పారిపో ప్రయత్నించటం క్షేమం కాదు. రాళ్ళ చాటున పొంచివున్న ఏ క్రూరమృగమైనా తనను యిట్టే పట్టుకుని చంపి తినగలదు.

ఇప్పుడేం చేయాలి? కేశవుడు గుండె రాయి చేసుకున్నాడు. కత్తివున్న చేతిలోనే కొన్ని అంబులుకూడా పట్టుకుని, ఎడమ చేతితో విల్లు పట్టుకుని అతడు జాగ్రత్తగా గుహ ముందు నుంచి ఒక్కొక్క అడుగే వెనక్కు వేయసాగాడు.

హఠాత్తుగా గుహలో పెద్ద కాంతి కనిపించింది. ఆ వెలుగులో కేశవుడికి సన్నని పొడవాటి గడ్డం, నల్లని ముఖం, నెత్తిమీద కుచ్చుకట్టిన శిరస్త్రాణం గల ఒక వికృతాకారుడు కనిపించాడు. అతణ్ణి చూస్తూనే కేశవుడు నిలుచున్నచోట ఆగిపోయాడు.



"వత్సా, భయపడకు, భయపడకు, అభయ మిస్తున్నాను! నిన్నే కాక, నీ ముసలి తండ్రినికూడా దుర్మార్గులైన రాజ భటుల నుంచి కాపాడేభారం నాది!" అంటూ ఆ వికృతాకారుడు గుహ లోపలినుంచి బయటికి వచ్చాడు.

ఆ వికృతాకారుడి మాటలు కేశవుడి శరీరాన్ని జలదరింపచేసినై. "వీడెవడో గాని నా గురించి సర్వం తెలుసుకున్నాడు," అనుకున్నాడతడు. ఇప్పుడు తను పారిపోయే ప్రయత్నం చేయుటం వృథా. అందువల్ల మేలుకన్న కీడే ఎక్కువ కలగవచ్చు. ఎంతో ప్రేమ కనబరుస్తున్న ఈ వికృతా



కారుడు తన నుంచి ఎలాంటి సహాయం ఆశించి తననూ, తన తండ్రినీ రాజభటుల నుంచి కాపాడతానని అభయమిస్తున్నాడు?

"పత్సా, నువ్వు నా శక్తి సామర్థ్యాలను శంకిస్తున్నావా? ఇటురా, గుహలోకి రా!" అంటూ వికృతాకారుడు వెనుతిరిగి గుహలోకి వెళ్ళబోయేవాడల్లా ఆగి, కదలక నిలబడివున్న కేశవుణ్ణి పరీక్షగా చూస్తూ, "నా వెంట గుహలోకి వచ్చేందుకు భయమా?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న కేశవుడికి కోపం తెప్పించింది. తననేదో పిరికిపంద కిందకట్టి వీడు మాట్లాడుతున్నాడన్న అభిప్రాయం కలగగానే, కేశవుడు ధైర్యంగా ముందుకు నడుస్తూ, "నీ వెంట గుహలోకికాదు మరెక్కడికి రమ్మన్నావస్తాను. అడవిలోపుట్టి అడవిలో పెరిగినవాణ్ణి. భయం అంటే ఏమిటో నాకు తెలీదు. పోతే, నన్ను బాధిస్తున్న సంశయం ఏమిటంటే, నీకు నా గురించీ, నా తండ్రిని గురించీ ఎలా తెలుసా అని!" అన్నాడు.

"అంతేనా? అయితే గుహలోకిరా, సంశయ నివారణ చేస్తాను. గుహలోవున్న కాలభైరవుడి కళ్ళల్లోకి తొంగి చూశావంటే, లోకంలో ఎక్కడ ఏమి జరుగుతున్నదీ నీవు తెలుసుకోవచ్చు," అన్నాడు వికృతాకారుడు.



కేశవుడు అతడి వెంట గుహలోకి వెళ్లాడు. గుహ లోపల అంతా చీకటిగా వున్నది. ఆ చీకటిలో ఓ పదడుగులు నడిచిన తరవాత పక్కగా కొండరాతిలో తొలిచిన చిన్న బిలం ఒకటి కనిపించింది. అందులో అంత ఎత్తున్న ఒక కుక్క ఆకారం—రాతిలో మలిచినది వున్నది. దాని రెండుకళ్ళూ నిప్పు కణాల్లా మెరుస్తున్నవి.

"వీడే కాలభైరవుడు! ఉపాసకుల ఊడలమర్రి, శత్రులపాలిటి బ్రహ్మ జెముడు! జై కాలభైరవా!" అంటూ వికృతాకారుడు మునివేళ్ళతో విగ్రహం కళ్ళను ఒకసారి తాకి, చప్పున వెనకడుగు వేస్తూ,



"కేశవా, ఇప్పుడు కాలభైరవుడి కళ్ళల్లోకి చూడు! అడుగో నీ తండ్రి, అవిగో నీ ఆల మందలు! రాజ భటులను చూశావా... విచ్చుకత్తులతో, అహ్హా(హ్హా!" అంటూ బిగ్గరగా నవ్వసాగాడు.

కేశవుడు ముందుకు వంగి కాలభైరవుడి కళ్ళల్లోకి చూశాడు.

కేశవుడి ముసలి తండ్రి గుబురుగా వున్న ఒక చెట్టుకొమ్మల్లో కూచునివున్నాడు. ఆవులు అడవిలో చెల్లా చెదురుగా పరిగెత్తుతున్నవి. వాటిని అన్ని వైపుల నుంచీ చుట్టుముట్టుతూ రాజభటులు గుర్రాలమీద తరుముకు వస్తున్నారు.

ఆ దృశ్యం చూస్తూనే కేశవుడికి ఎక్కడలేని విచారం కలిగింది. తన తండ్రి ప్రాణభయంతో చెట్టుమీద దాక్కున్నాడు. తన ఆలమందను రాజభటులు పట్టుకు పోవాలని చూస్తున్నారు. ఆ పశువులు లేకపోతే తన తండ్రి అడవిలో ఆకూ అలమూ తిని బతకవలసిందే. సమయానికి తను ఈ కొండ మీద చిక్కుకు పోయాడు!

వికృతాకారుడు కేశవుడి మనోభావాలు తెలిసిన వాడిలా నవ్వుతూ, "దిగులుపడకు కేశవా! నీ తండ్రినీ, నీ ఆలమందనూ కాపాడే భారం నాది," అంటూ గుహలో నుంచి బయటికి వచ్చి, "శిష్యా, శిష్యా, ఎక్కడ? నువు వెళ్ళి ఆ రాజభటులను తరిమి, మన కేశవుడి తండ్రినీ, ఆలమందనూ కాపాడు!" అంటూ కేకపెట్టాడు.

కాలభైరవుడి కళ్ళల్లోకి చూస్తున్న కేశవుడి దృష్టికి ఒక వింత దృశ్యం కనిపించింది. మనిషి తలా, గబ్బిలంలా రెక్కలూ వున్న ఒక నల్లని పెద్ద ఆకారం అడవిలో రాజభటుల తలల మీద ఎగురుతూ పల్టీలు కొట్ట సాగింది. ఆ భీకర స్వరూపాన్ని చూస్తూనే రాజభటులు, ప్రాణభయంతో కీచుకీచు మని అరుస్తూ అడవికి అడ్డంపడి పారిపోసాగారు. —(ఇంకా వుంది)





# అపరాజిత

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీవు పడే శ్రమ చూస్తూ ఉంటే ప్రేమకు వశీభూతుడ వయావా అని నాకు సందేహం కలుగు తున్నది. ఎందుకంటే ప్రేమ ఎంతో బల పత్తరమైనది. ఇందుకు కేశవ మహారాజు కథే దృష్టాంతం. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు విచిత్రమైన ఆ మహా రాజు కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకప్పుడు పాతాళ లోకంలో అపరాజిత అనే నాగకన్యక ఉండేది. ఆమె చక్కదనం సాటిలేనిది. నాగకన్యలు స్వేచ్ఛా జీవులు. తమ కిష్టమైనచోట ఉంటారు, ఇష్టం వచ్చి నట్టు ప్రవర్తిస్తారు. అందుచేత అపరాజిత పాతాళలోకాన్ని విడిచిపెట్టి భూలోకంలో

## బేతాళ కథలు



ఒక నదీతీరాన మడుగు వద్ద ఉంటూండేది. ఆ మడుగులో చంద్రకాంత శిలలున్నాయి. ఆమె ఆ శిలలపై కూచుని మడుగులో ఉండే తన పెంపుడు చేపతో ఆడుకునేది. మడుగులో ఈతలు కొట్టేది. మడుగు ఉండే ప్రదేశం కాస్త మరుగుగా ఉండేది. ఎందుకంటే దాని చుట్టూ దట్టమైన పొద లున్నాయి. అందుచేత ఆ మడుగు చాయ లకు ఎవరూ వచ్చేవారు కారు. ఇతరుల కళ్ళపడటం ఇష్టంలేని అపరాజితకు అక్కడ ఎంతో సౌఖ్యంగా ఉండేది.

అపరాజిత ఉండే మడుగుకు కొంత దూరంలో ఒక నగరం ఉండేది. ఆ నగరా నికి కేశవుడు రాజు. ఆయన అందం వర్ణనా తీతం, అపర మన్మథుడు. కాని ఆయనకు ఆడవాళ్ళంటే ద్వేషం. ఈ ద్వేషానికి కారణం లేకపోలేదు. కేశవుడి తండ్రికి ఎందరో భార్య లుండేవారు. వారందరూ ఆయనను వంచించారు. వారి మీది కోపం కొద్దీ ఆయన తన కొడుకైన కేశవుడికి స్త్రీ ద్వేషం రంగరించి పోశాడు. అది కేశవుడి నరనరానికీ పట్టిపోయింది. అందుచేతనే కేశవుడు యుక్తవయస్కుడై ప్రతి ఆడదాని మనసునూ ఆకర్షించి నప్పటికీ ఒక్క ఆడదీకూడా అతని మనసును ఆకర్షించ లేకపోయింది.

కేశవుడు పాలించే నగరంలోనే కామ రూపుడనే ఒక మంగలి ఉండేవాడు. వాడి పేరుకు విరుద్ధంగా ఉండేది వాడి ఆకారం. మెల్ల కన్నూ, సొట్ట కాలూ, గూనీ కలిగి కామరూపుడు పగలు చూస్తే రాత్రి కలలోకి వచ్చేటంత భయంకరంగా ఉండేవాడు.

ఈ కామరూపుడు ఒకనాడు అడవిలో సంచరిస్తూ తలవని తలంపుగా అపరాజిత ఉండే మడుగు వద్దకు వచ్చాడు. అపరా జితను చూడగానే వాడికి ఆమెపై వెర్రి మోహం కలిగింది. అపరాజిత మటుకు వాడి వికారాకారం చూసి రోతపడి, "పో నా కళ్ళ

ఎదుటి నుంచి," అంటూ వాణ్ణి తరిమేసింది. వాడు మతి పోయిన వాడిలాగా అయిపోయి నగరానికి చేరుకున్నాడు.

ఇది జరిగిన కొద్ది రోజులకే కేశవమహారాజు వేటకు బయలుదేరి వెళ్ళి తిరిగి వస్తూ, తన పరివారాన్ని వెనకవిడిచి అతి వేగంగా అరణ్యమార్గాన అపరాజిత ఉండే మడుగు సమీపించి, చలవరాళ్ళపై బోర్లా పడుకుని తన పెంపుడు చేపతో ఆడుకుంటున్న నాగకన్యను చూశాడు. ఎవరో తన రహస్యస్థలం ప్రవేశించారని గ్రహించి నాగకన్య లేచి కూచున్నది. అపరాజితా కేశవమహారాజూ ఒకరి సౌందర్యాన్ని ఒకరు చూసి దిగ్భ్రాంతులైనారు.

ఆక్షణంలోనే అపరాజిత కేశవుణ్ణి ప్రేమించింది. ఆమె స్వేచ్ఛాజీవి కావటం చేత తన ప్రేమను దాచక అతనితో చెప్పేసి, అతణ్ణి ఆలింగనం చేసుకోవటానికి కూడా ప్రయత్నించింది. కేశవు డామెను తోసేసి, "ఆడవాళ్ళు మాయావినులు. వారి స్పర్శ పాముకాటు లాటిది. నేను స్త్రీల మాయలకు లోబడే వాణ్ణి కాను," అంటూ మడుగు చుట్టూ ఉన్న పొదలు దాటి వచ్చేశాడు.

ఆ సమయానికే పరివారం కూడా వచ్చింది. రాజు వారితో కలిసి నగరానికి




వెళ్ళిపోయాడు. అయితే అతనిలో పెద్ద మార్పు వచ్చేసింది. కేశవుడు అపరాజిత ప్రేమనైతే తృణీకరించాడు గాని ఆమె సౌందర్యం ఆయనను పూర్తిగా వశపరుచుకున్నది.

వేటకు వెళ్ళి వచ్చినది మొదలు రాజుగారు అన్నం ముట్టడు, కన్ను మూయడు, మంత్రులతో మంతనాలు చెయ్యడు. మతి పోయిన వాడిలాగా ఉన్నాడు. రాజుగారికి గాలో, దయ్యమో, భూతమో సోకిందనుకున్నారు మంత్రులు. వైద్యులనూ, భూతవైద్యులనూ, మంత్ర వైద్యులనూ రప్పించి చికిత్సలు చేయించారు. ఈ చికిత్సలు

రాజుగారి మీద కొంచెంకూడా పారలేదు. కేశవ మహారాజును పీడిస్తున్నది ప్రేమ వ్యాధి అని ఎవరూ తెలుసుకోలేదు. ఆయన అపరాజితను చూసిన సంగతి ఎవరికీ తెలియదు. రాజైనా ఈ ప్రేమజాడ్యానికి లొంగిపోయి ఊరుకున్నాడే గాని తన ప్రేమ సఫలం చేసుకోవటానికి ఎలాటి యత్నమూ చేయలేదు.

అపరాజితకూడా ప్రేమకు గురి అయింది. కాని ఆ ప్రేమను సఫలం చేసుకునేటందుకు అవసరమైన పథకం ఆమె తయారు చేసుకున్నది. ఆమె మడుగులో దూకి, పాతాళ లోకానికి వెళ్ళి, తన తండ్రిని కలుసుకుని, "నాన్నా, నాకు పరకాయప్రవేశ మంత్రం చెప్పు," అని అడిగింది. నాగరాజు తన కూతురికి రెండు మంత్రాలు చెప్పాడు. ఒకటి శరీరాన్ని వదిలిపెట్టటానికి, రెండవది శరీరంలో తిరిగి ప్రవేశించటానికి. ఈ రెండు మంత్రాలూ కంఠస్థం చేసుకుని, వాటిద్వారా తన ప్రేమను ఏ విధంగా సఫలం చేసుకోవాలో ఆలోచించుకుని అపరాజిత తన మడుగు వద్దకు తిరిగి వచ్చింది.

ఈలోపల గూనిమంగలి కామరూపుడు నాగకన్యను తలుచుకుని యమబాధ పడిపోతున్నాడు. ఆ బాధతోనే తాను చావటం తప్పదని వాడికి తోచిపోయింది. అటువంటి



అతిలోకసుందరి తన వంటి కురూపిని ఎలాగూ కన్నెత్తి అయినా చూడదు. కనీసం తానైనా ఆమెను చూస్తూ ఉంటే ప్రాణాలు దక్కుతా యనుకున్నాడు.

ఈ ఆలోచన రాగానే వాడు బయలుదేరి మడుగు వద్దకు వెళ్ళి అక్కడి పొదలలో దూరాడు. నాగకన్యకు తెలియకుండానే ఆమెను చూడాలని కామరూపుడి ఉద్దేశం. అయితే వాడు ఒక ఎండు పుల్లపై కాలు వేసేసరికి అది పెళ్ళున విరిగి చప్పుడయింది. అపరాజిత తల ఎత్తి వాణ్ణిచూసి, కిందటి సారిలాగా ఆగ్రహించకపోగా, తన వద్దకు రమ్మని వాడికి సైగచేసింది.

ఒక వంక బెదురుతూ మరొకవంక ఆనంద తన్మయుడవుతూ కామరూపుడు నాగకన్యను సమీపించాడు. ఆమె వాణ్ణి చలవరాతి మీద తన సరసన కూచోమని, "నీకు నాపై ఎంత ప్రేమ ఉన్నదో నేనెరుగుదును, కాని నీవు కురూపివి. మీ రాజుగారు నవమన్మథుడని విన్నాను. నీవు ఎలాగైనా ఆయన శరీరంలో ప్రవేశించినట్టయితే నేను నిన్ను ప్రేమించగలుగుతాను. నీప్రేమ సఫలమవుతుంది. ఇందుకు అవసరమైన మంత్రాలు రెండు నేను నీకు చెబుతాను. వాటిని తెలివిగా ఉపయోగించుకునే భారం నీదే," అని, తన తండ్రి చెప్పిన మంత్రాలు





రెండూ గూనివాడికి చెప్పేసింది. వాడి సంతోషానికి మేరలేదు.

రాజుగారి వ్యాధి ఎంతకూ నయం కానందున, ఆయనకు చికిత్స చేసినవారికి ఆయన ఎత్తు బంగారం ఇస్తామని చాటింపు వేశారు. గూనివాడు రాజుగారికి వ్యాధి నయంచేసే నెపంమీద తన పని పూర్తి చేసుకోవటానికి ఎత్తుగడవేసి రాజభవనానికి వెళ్ళాడు. మొదట్లో ద్వారపాలకులు వాడి మాట నమ్మలేదుగాని చివరకు వాణ్ణి లోపలికి వెళ్ళనిచ్చారు.

రాజుగారూ, ఆయన కింది ఉద్యోగులూ ఉన్న చోటికి వెళ్ళి గూనివాడు మొగ్గలు వేసి, వికారంగా నృత్యాలు చేశాడు. అక్కడ వున్న వారందరితోబాటు రాజుగారు కూడా విరగబడి నవ్వాడు.

తరవాత గూనివాడు రాజుగారితో, "మహారాజా, మీ పరివారంతో సహా అరణ్యానికి నా వెంట రండి. అక్కడ ఏకాంతంగా మీ కొక మహాద్భుతం చూపిస్తాను," అని అన్నాడు.

రాజు సరేనన్నాడు. గూనివాడు అరణ్యంలో రాజును ఒక ఏకాంత స్థలానికి తీసుకుపోయాడు. అక్కడ వారికొక చచ్చిన చిలుక కనబడింది. "మహారాజా, నేను పరకాయ ప్రవేశం చేస్తాను చూడండి," అంటూ, గూనివాడు మొదటి మంత్రం చదివి తన శరీరాన్ని వదిలి చిలుక శరీరంలో ప్రవేశించాడు. చిలుక ప్రాణంతో లేచి, "చూశారా, మహారాజా!" అని అడిగింది. తరవాత అది రెండో మంత్రం చదివి చచ్చిపడిపోయింది.

అంతదాకా కట్టెలాగా పడిఉన్న గూనివాడు లేచి కూచున్నాడు.

తరవాత వాడు రాజుతో, "మహారాజా, ఇందులో కనుకట్టుగాని, మర్మంగాని ఏమీ లేదు. నేను చదివిన మంత్రాలు చదివితే మీరైనా పరకాయ ప్రవేశం చెయ్యవచ్చు.

భయం లేకపోతే అ చిలుకలో ప్రవేశించండి," అన్నాడు.

క్షుద్రుడైన గూనివెధవ తనను అంత మాట అనేసరికి రాజుకు పౌరుషం వచ్చింది. ఆయన రెండు మంత్రాలూ కంఠస్థం చేసి, మొదటి మంత్రం సహాయంతో తన శరీరం విడిచి చిలుక శరీరంలో ప్రవేశించాడు. మరుక్షణమే గూనివాడు తన శరీరాన్ని విడిచి రాజు శరీరంలో ప్రవేశించి, రాజుగారి గుర్రమెక్కి అతివేగంగా పరివాన్ని కలుసుకుని రాజభవనానికి బయలుదేరాడు.

జరిగిన మోసం తెలుసుకుని రాజు, చచ్చిన చిలుక శరీరంకంటె వికారంగా ఉన్న గూనివాడి శరీరమే నయమనుకుని అందులో ప్రవేశించి కాలినడకను తన ఇంటికి బయలుదేరాడు. కాని రాజభవనంలో ప్రవేశించటం ఆయనకు సాధ్యపడలేదు. ఆయన పహరావాళ్ళతో, "నేనే అసలు రాజును. రాజులాగా వచ్చినవాడు మంగలి," అనేసరికి వాళ్ళు ఆయనను పట్టుకుని తన్ని అవతలికి గెంటారు.

తన పరిస్థితి తలుచుకున్నకొద్దీ రాజుకు మతిపోయింది. తనకు రాజ్యం పోయింది, అసహ్యకరమైన శరీరం సంప్రాప్తమయింది. తనను ఇంత చేసిన దుర్మార్గుణ్ణి తాను ఏమీ చెయ్యలేదు. తాను నిజం చెప్పినా





ఎవరూ నమ్మరు. ఇదంతా తలుచుకుంటే ఆయనకు ఇలా బతకటంకంటె మరణం మేలనిపించింది. కాని ఇంతలోనే ఆయనకు నాగకన్య జ్ఞాపకం వచ్చింది. ఆమె ఒకప్పుడు తనను ప్రేమించింది. నాగకన్య కావటం చేత ఆమె వద్ద కొన్ని సిద్ధు లుండవచ్చు. తనకు జరిగిన అన్యాయానికి ఆమె విరుగుడు కనిపెట్టవచ్చు.

ఈ ఆలోచన రాగానే గూని మంగలి రూపంలో ఉన్న రాజు మడుగు వద్దకు వెళ్ళి అపరాజితతో తన గోడు చెప్పుకున్నాడు. ఆమె అంతా విని, "మీరు వెళ్ళి పొదలలో దాక్కోండి. మంగలి మీ శరీరంలో నుంచి బయటికి వచ్చేటట్టు నేను యుక్తి చేస్తాను. మీరు ఏమరుపాటుగా ఉండక అవకాశం దొరకగానే మీ శరీరంలో తిరిగి ప్రవేశించాలి," అని చెప్పింది.

రాజు వెళ్ళి పొదలలో దాక్కున్న కొద్ది సేపటికి ఆయన శరీరంతో మంగలి కామరూపుడు వచ్చాడు. ఈలోపల అపరాజిత మడుగులో నుంచి ఒక చచ్చిన చేపను తెచ్చి చలవరాతి మీద పెట్టుకుని ఏడవ నారంభించింది.

మంగలి ఆమెను సమీపించి, "ఓ సుందరీ, నీకు నచ్చే శరీరం ధరించి వచ్చాను. ఇక నన్ను ప్రేమించు," అన్నాడు.

"నీవు తక్షణం వెళ్ళిపో! నాకు తల్లి లాగా ఉండే చేప కాస్తా చనిపోయింది. నేను పుట్టెడు దుఃఖంలో ఉన్నాను," అన్నది అపరాజిత.

"చేప కోసం నన్ను వదులుకుంటావా?" అన్నాడు మంగలి.

"ఈ చేప అనుమతి లేకుండా నేను ఎన్నడూ ఏ పనీ చెయ్యలేదు," అంటూ అపరాజిత పెద్ద శోకం పెట్టింది.

"నీకు కావలిసింది చేప అనుమతే అయితే అది నా చేతిలో పనే!" అంటూ మంగలి మంత్రం జపించి, రాజు శరీరం

విడిచి చేప శరీరంలో ప్రవేశించి, "అమ్మాయీ, నీవీ రాజును నిశ్చింతగా పెళ్ళాడు," అన్నాడు.

చేప ఇంకా మాట్లాడుతుండగానే రాజు పాదల మధ్యను గూని శరీరం వదిలేసి తన శరీరంలో ప్రవేశించాడు.

అపరాజిత పరమానందంతో, "ఆహా, నా తల్లి పలికింది! నేను రాజును పెళ్ళాడతాను!" అన్నది. రాజుకూడా సంతోషంగా సమ్మతించాడు. మంగలి తన పొరపాటు గ్రహించి, చేప శరీరాన్ని వదిలి తన శరీరంలో ప్రవేశించాడు. రాజు వాణ్ణి చంపటానికి సిద్ధపడ్డాడు గాని, అపరాజిత వారించింది. అందుచేత రాజు మంగలికి దేశ బహిష్కరణ శిక్ష విధించాడు. మంగలి ఆ దేశం విడిచి వెళ్ళిపోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, స్త్రీ విముఖుడైన రాజు చివరకు నాగకన్యను పెళ్ళాడటానికి ఎందుకు ఒప్పుకున్నాడు? ఆమె మూలంగా తనకు రాజ్యం తిరిగి వచ్చిందనా, లేక ఆమె మీది ప్రేమ చేతనా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజుకు అపరాజిత చేసిన నిజమైన మహోపకారం అతని శరీరాన్ని అతనికి తిరిగి వచ్చేటట్టు చెయ్యటం. ప్రతి ప్రాణీ తన శరీరాన్ని అన్నిటికన్న అధికంగా ప్రేమిస్తుంది. ఏ ప్రేమకూడా దానితో సమానం కాదు. రాజు నాగకన్యను ప్రేమించి ఉండవచ్చు, రాజ్యం పోయిందని విచారించి ఉండవచ్చు, కాని తన శరీరాన్ని తిరిగి సంపాదించటంకన్న ఆయనకు గొప్ప ఆనందం మరేదీ ఉండబోదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# నీతిపరులు

పూర్వం శ్రీరంగపట్నంలో ముత్యాలశెట్టి అనే రత్న వర్తకు డుండేవాడు. ఆయన గొప్ప ధనికుడు. సముద్ర వ్యాపారంకూడా చేసేవాడు.

ఒకనాడు ముత్యాలశెట్టి వద్దకు రామచంద్రుడు అనే ఆంధ్రదేశపు ధనికుడు వచ్చాడు. ముత్యాలశెట్టి వద్ద ఉండే మేలి రత్నాలన్నీ చూశాడు. వాటిలో ఒక రత్నం రామచంద్రుడికి బాగా నచ్చింది. దాని వెల ఎంత అని అడిగితే, ముత్యాలశెట్టి నాలుగు వేల వరహాలని చెప్పాడు. రామచంద్రుడి వద్ద మూడువేల వరహాలే ఉన్నాయి. అయినా ఆ రత్నాన్ని వదలటానికి మనసు ఒప్పక ఆయన ముత్యాలశెట్టితో, "శెట్టి గారూ, ప్రస్తుతం నా దగ్గిర ఉండే మూడు వేల వరహాలూ ఇస్తాను. రత్నం నాకివ్వండి. నే నింటికి వెళ్ళి మిగతా వెయ్యి వరహాలూ పంపుతాను," అన్నాడు.

రామచంద్రుడు కులీనుడూ, నిజాయితీ గలవాడూ అన్న సంగతి కనిపెట్టి ముత్యాలశెట్టి, "అలాగే చెయ్యండి. మీరివ్వవలిసిన మొత్తం మీపేర ఖాతా పుస్తకంలో గుర్తుగా పద్దువేసి ఉంచుతాను," అన్నాడు.

రామచంద్రుడు పరమానందంతో రత్నాన్ని తీసుకుని స్వదేశానికి తిరిగి వచ్చాడు. వచ్చిన కొద్దిరోజులకే ఆయనకు జబ్బుచేసి మంచాన పడ్డాడు. ఆ వ్యాధి వైద్యానికి లొంగకపోవటంచేత ఆయన ఒక నెల మంచాన తీసుకుని చనిపోయాడు. చనిపోయేటప్పుడు ఆయన తన కొడుకైన పద్మనాభుణ్ణి పిలిచి, తాను శ్రీరంగపట్నంలో ముత్యాలశెట్టి వద్ద కొన్న రత్నం సంగతి చెప్పి, దాని తాలూకు బాకీ తీరుస్తానని అతనిచేత ప్రమాణం చేయించుకున్నాడు.

రామచంద్రుడు బతికినన్నాళ్ళూ తన కున్నదంతా ఖర్చుచేసి భోగాలతో జీవితం

టి. రామానందం



వెళ్ళబుచ్చినవాడు కావటంచేత ఆయన అనంతరం దమ్మిడీకూడా మిగలలేదు. అందువల్ల పద్మనాభుడు ఎంత ప్రయత్నించినా ముత్యాలశెట్టి బాకీ తీర్చలేకపోయాడు. వాడు చివరకు తన తండ్రి కొన్న రత్నాన్ని అమ్మి అయినా బాకీ చెల్లబెడదా మనుకున్నాడు. కాని అంత ఖరీదుగల రత్నాన్ని కొనే తాహతుగల వాళ్ళెవరూ పద్మనాభుడికి కనిపించలేదు.

చివరకు పద్మనాభుడు ఆ రత్నాన్ని పట్టుకుని నేరుగా శ్రీరంగపట్టణానికే బయలుదేరాడు. ఆ పట్టణంలో ఆ రత్నం అమ్ముడైతే సరేసరి, లేనిపక్షంలో దాన్ని ముత్యాలశెట్టికే తిరిగి ఇచ్చేసి, ఆయన ఇచ్చినంత సొమ్ము పుచ్చుకుందామని అతడి ఉద్దేశం. కాని పద్మనాభుడు శ్రీరంగపట్టణం చేరే సమయానికి ఆ నగరాన్ని శత్రురాజులు ముట్టడించి కొల్లగొట్టుతున్నారు. నగరమంతా అరాజకంగా ఉన్నది. అటువంటి పరిస్థితిలో పద్మనాభుడు వచ్చినదారి పట్టినట్టయితే క్షేమంగా ఉండేది. కాని వాడు కార్యదీక్షకొద్దీ నగరమంతా తిరిగి ముత్యాలశెట్టి ఇల్లు కనుక్కోవటానికి ఉపక్రమించాడు. ఈవిధంగా వాడు శత్రుసైనికుల వాత పడ్డాడు. వాళ్ళు పద్మనాభుణ్ణి పట్టుకుని, వాడి వద్ద ఉండే రత్నం కాస్తా కాజేసి, చావ చితకగొట్టి వదిలిపెట్టేశారు.

శ్రీరంగపట్టణం మీద శత్రువులు వచ్చి పడిన సమయంలో ముత్యాలశెట్టి కొడుకు ఇంటి నుంచి మైసూరుకు పారిపోయాడు. శత్రుసైనికులు ముత్యాలశెట్టి దగ్గిర ఉన్నదంతా ఊడ్చి పట్టుకుపోయారు. ముత్యాలశెట్టి విచారంతో మంచంపట్టి మనోవ్యాధితోనే ప్రాణాలు వదిలాడు. మైసూరు చేరిన ముత్యాలశెట్టి కొడుకు తన తండ్రి పేరు చెప్పుకుని అక్కడక్కడా అప్పులు చేసి, చివరకు అప్పుకూడా పుట్టక తిండికి మాడి చనిపోయాడు.

ముత్యాలశెట్టి వంశానికి ఆయన మనవడు గోవిందశెట్టి మిగిలాడు. వాడు చాలా బుద్ధిమంతుడు. వాడికి తాతగారి ఆస్తి సంక్రమించక పోయినా తండ్రి చేసిన అప్పులు సంక్రమించాయి. వాడు కష్టపడి చదువుకుని, పెద్ద వర్తకుల వద్ద గుమాస్తాగా ఉంటూ తన తాహతుకు తగినట్టు చిన్న చిన్న క్రయవిక్రయాలు చేస్తూ, తన సంపాదనలోనే సాధ్యమైనంత మిగుల్చుకుని తండ్రి చేసిన అప్పులు ఒక్కటొకటే తీరుస్తూరాసాగాడు.



అక్కడ పద్మనాభుడుకూడా ఆట్టేకాలం బతకలేదు. ముత్యాలశెట్టి బాకీ తీరుస్తానని తండ్రి వద్ద ప్రమాణం చేశాడు. రత్నాన్ని నిష్కారణంగా పోగొట్టుకోవటమే గాక తీవ్రంగా దెబ్బలు తిన్నాడు. ఆ దెబ్బలతోనే మంచంపట్టి మళ్ళీ కోలుకోలేదు. అతను చనిపోయే సమయంలో తన కొడుకైన చంద్రశేఖరుణ్ణి పిలిచి, "నాయనా, శ్రీరంగపట్టణంలో ఉండే ముత్యాలశెట్టికి మీ తాత వెయ్యి వరహాలు బాకీ పడ్డాడు. ఆ బాకీ తీర్చటానికి నేను ప్రయత్నం చేసి నష్టపోయాను. ఆ బాకీ ఇప్పటికి మూడు వేల వరహాలవుతుంది. అందుచేత నీవైనా కష్టపడి ధనం సంపాదించి, శ్రీరంగపట్నం వెళ్ళి, ముత్యాలశెట్టికి బాకీ తీర్చి వారి పద్దుపుస్తకంలో ఈ బాకీ పద్దు రద్దు చేయించు. నీవీ పని చేస్తేగాని నా ఆత్మా నీ తాత ఆత్మా శాంతించవు," అని చెప్పాడు.

చంద్రశేఖరుడు శ్రమపడి డబ్బు కూడబెట్టాడు. త్వరలోనే వాడు నాలుగు వేల వరహాలు పోగుచేసుకుని, వాటితో శ్రీరంగపట్నం వెళ్ళాడు. ముత్యాలశెట్టీ, ఆయన కొడుకూ పోయారనీ, వారి వారసుడు గోవిందశెట్టి ఉన్నాడనీ తెలిసింది. చంద్రశేఖరుడు గోవిందశెట్టి ఇంటికి వెళ్ళి, తన ఊరూ పేరూ చెప్పుకుని, "అయ్యా, మీ తాతగారినాటి పద్దుపుస్తకం తీయిస్తారా?

అందులో ఒక బాకీ తాలూకు పద్దుంటుంది," అని అడిగాడు.

ఈ మాట వినగానే గోవిందశెట్టి గుండెల్లో రాయి పడింది. ఆ రోజే వాడు తన తండ్రి చేసిన బాకీలను నిశ్శేషంగా తీర్చివేశాడు. తండ్రిగారి అప్పులు తీరాయిగదా అనుకుంటే తాతగారి అప్పులు మీద పడేలాగుంది.

వాడు చంద్రశేఖరుడితో, "అయ్యా, నేను మా తండ్రిగారి అప్పులు తీర్చేసరికి తలప్రాణం తోకకు వచ్చింది. మా తాతగారి అప్పులుకూడా తీర్చమనటం ధర్మమా? వాటికి నేను బాధ్యుణ్ణి కాను. వాటికి ఏనాడో కాలదోషం పట్టి ఉంటుంది. క్షమించండి!" అన్నాడు.

చంద్రశేఖరుడు చిరునవ్వు నవ్వి, "మీ తాతగారు మా కేమీ బాకీ లేరు. ఏనాడో మా తాతగారే మీ తాతగారికి వెయ్యి వరహాలు బాకీపడ్డారు. మాట నమ్మకంమీద మీ తాతగారు అప్పుపెట్టారు. పరువైన వాడి మాటకు కాలదోషం ఏముంటుంది గనక? మా తాతగారి బాకీ వడ్డీతో సహా తీర్చటానికి సొమ్ము తెచ్చాను. దయచేసి పద్దుపుస్తకం వెతకండి," అన్నాడు.

గోవిందశెట్టి చంద్రశేఖరుడి నీతిపరత్వానికి ఆశ్చర్యపడ్డాడు. అతను పాతకట్టలన్నీ వెతకగా ఒక పద్దుపుస్తకంలో రామచంద్రుడి పేర వెయ్యివరహాలు ఖర్చు పద్దు వున్నది.

గోవిందశెట్టి చంద్రశేఖరుడితో, "ఈ బాకీ సంగతి మీరు చెప్పేదాకా నాకు తెలీదు. నేను దీన్ని రొక్కంగా పుచ్చుకోను. మీవంటి నీతిపరులు ఎక్కడా నాకు దొరకరు. మీరు తెచ్చిన నాలుగు వేల వరహాలతో మనిద్దరమూ సమిష్టి వ్యాపారం చేద్దాం. మీకు అభ్యంతరం లేకపోతే చెప్పండి," అన్నాడు.

చంద్రశేఖరుడు సరే నన్నాడు. ఇద్దరూ కలిసి వ్యాపారం చేసి త్వరలోనే సంపన్నులై, ఎంతో స్నేహంగా ఉంటూ జీవితాలు వెళ్ళబుచ్చారు.





# అర్థంలేని అనుమానాలు

ఒకనాడు డాక్టర్ జాన్సన్ అనే ప్రసిద్ధ రచయిత వద్దకు ఒక పెద్ద మనిషి వచ్చి, "అయ్యా, జీవితం నిరర్థకం, నిరుపయోగం. అల్ప జీవి అయిన మానవుడు ముక్తి మార్గం చూసుకునేటందుకు వ్యవధి ఎక్కడ?" అన్నాడు.

"వ్యవధి ఎందుకు లేదూ?" అని జాన్సన్ అడిగాడు.

"చూడండి. మనిషి మహా బతికితే నూరేళ్ళు బతికేను. అనంతమైన కాలంలో ఇది ఎంత? ఇందులో సగం నిద్రలోనే పోయె. మిగిలిన దానిలో కొంత బాల్యం కిందా, రోగాల కిందా పోతుంది. ఆ మిగిలిన దానిలో కాలకృత్యాల కిందా, వృత్తిపనులు చూసుకోవటం కిందా పోతుంది. ఇవన్నీ పోగా ఏ కొంచెమో మిగిలితే అది విచారించటానికీ, పోట్లాటలకూ, సంఘర్షణలకూ సరి పోతుంది. ఇక మనిషి నిశ్చలచిత్తంతో కూచుని ఈశ్వరధ్యానం చేస్తూ ఆముష్మికాన్ని గురించి ఆలోచించటానికి వ్యవధి ఎక్కడ. జీవితం కేవలం నిరుపయోగం," అన్నాడు పెద్దమనిషి.

డాక్టర్ జాన్సన్ తల పంకించి, కంట నీరు పెట్టుకోసాగాడు.

"తమ రెందుకు విచారిస్తున్నారు?" అని పెద్దమనిషి అడిగాడు.

"మీరు పరలోకం గురించి ఆలోచిస్తున్నారు. నాకు ఇహలోకంలోనే పెద్ద సమస్య వచ్చి పడింది," అన్నాడు జాన్సన్ కళ్ళు తుడుచుకుంటూ.

"ఏమిటా సమస్య?" అని పెద్దమనిషి అడిగాడు.

స్వామి రామతీర్థ

"నేను తినే తిండికి అవసరమైన ధాన్యం పండించటానికి భూమిపైన చోటు లేదు," అన్నాడు జాన్సన్.

పెద్దమనిషి ఆశ్చర్యంతో, "అదేమిటి, అలా అంటున్నారు?" అన్నాడు.

"వినండి. ఈ అనంతమైన విశ్వంలో ఎన్నో కోట్ల నక్షత్రాలు. మన సూర్యుడే అణు మాత్రమైన నక్షత్రం. భూమి సంగతి వేరే చెప్పాలా? అది విశ్వంలో పరమాణువు కన్నకూడా అల్పమైనది. ఈ అల్పమైన భూమిపైన ముప్పాతిక మేర సముద్రమే ఆక్రమించింది గద. మిగిలిన దానిలో ఏడో వంతు కేవలం ఎడారిభూమి. అది పోగా మిగిలిన దానిలో ఎన్ని పర్వత పంక్తులు! ఎన్ని అరణ్య భూములు! ఎంతెంత మంచు భూములు! ఎన్నెన్ని సరస్సులు! ఎంతెంత నదులు! ఊబులు! ఎన్ని మహానగరాలు! ఎన్ని రోడ్లు! ఎన్ని బీళ్ళు! ఇవన్నీ పోగా మిగిలినది ఎంత? అందులో పండే పంట ఎంత? అది ఇన్ని వందలకోట్ల మందికి సరి పోవాలే! అసంభవం! నా తిండిగింజలు పండించటానికి భూమిపై చోటులేదు, జీవితం నిరర్థకం!" అన్నాడు జాన్సన్.

జాన్సన్ మాటలలో గల వ్యంగ్యం పెద్ద మనిషికి అర్థమైంది. ఆయన చెప్పేది తార్కికంగానే ఉన్నప్పటికీ, ఆ తర్కంలో వాస్తవం కొంచెంకూడా లేదు. ఈ సత్యాన్ని పెద్దమనిషి గ్రహించాడు.





# సైమన్

## 2

తరవాత సైమన్ ఆ భవనంలోనే ఒక చోట పడుకుని తెల్లవారేదాకా నిద్రపోయాడు. వాడికి నిద్ర వదిలేవేళకు బయట బండి చప్పుడు వినిపించింది. సైమన్ గతి ఏమయిందో తెలుసుకుందామని రాజూ, రాజకుమార్తే బండిలో వచ్చారు. సైమన్ బతికి ఉండి బయటికి రావటంచూసి వాళ్ళు పొందిన ఆనందం ఇంతా అంతా కాదు.

"దయ్యానికీ, రాజభవనానికీ కూడా పీడ విరగడ అయిపోయింది. ఇక భయంలేదు, మీరు లోపలికి వచ్చి అంతా చూసుకోండి," అన్నాడు సైమన్.

రాజభవనం మామూలు స్థితికి వచ్చినందుకు రాజు సంతోషించాడు. ఎవరూ చెయ్యలేకపోయిన పని చేసినందుకు సైమన్ రాజకుమార్తె కళ్ళకు ఒక దేవతలాగా కనిపించాడు. అతన్ని ఎంతసేపు చూసినా ఆమెకు తనివితీరలేదు.

పన్నెండో గదిలో గుట్టగా పడి ఉన్న శవాలన్నిటికీ రాజు శ్రద్ధగా ఉత్తరక్రియలు చేయించాడు; కొండ మీది రాజభవనానికి సంస్కారం చేయించి అందులో తిరిగి గృహప్రవేశం చేశాడు. గృహప్రవేశంతోబాటే రాజకుమార్తెకు సైమన్‌తో పెళ్ళి ప్రధానం కూడా జరిగింది. బ్రహ్మాండమైన విందు చేశారు. రాజు వెంటనే తన కుమార్తె వివాహం కూడా జరిపించేద్దామనుకున్నాడు గాని ఇందుకు సైమన్ అభ్యంతరం చెప్పాడు. "నేను ఇల్లు విడిచి వచ్చి చాలా కాలమయింది. మా అమ్మా, నాన్నా ఎలా ఉన్నారో, వారు బతికి ఉన్నారో లేదోకూడా నాకు తెలియదు. నా సంగతి వారికీ

సి. మాధవరావు



తెలియదు. అందుచేత వారిని ఒక్కసారి చూసి మరీవస్తాను. వారు సుఖంగా ఉంటే వెంట తీసుకువస్తాను. ఆ తరవాత పెళ్ళి ఏర్పాటు చేద్దురుగాని!" అన్నాడు వాడు.

సైమన్ ప్రయాణానికి పెద్ద ఎత్తున సన్నాహం జరిగింది. సైమన్ రాజకుమార్తెకు వీడ్కోలు చెబుతూ, తాను ఫలాని గడువు లోపల తిరిగి వస్తానని చెప్పాడు. ఆ గడువు లోపల రాకపోతే సైమన్‌కోసం తానే బయలు దేరి వస్తానని రాజకుమార్తె హెచ్చరించింది. బోలెడంత మంది నౌకర్లనూ, పరివారాన్నీ వెంట పెట్టుకుని రాజోచితంగా సైమన్ తన గ్రామానికి బయలుదేరాడు.

పది రోజులపాటు ప్రయాణం సవ్యం గానే సాగింది. పదోరోజు ప్రయాణీకులకు ఒక కీకారణ్యం తగిలింది. చీకటిపడే సమయానికి వాన సాగింది. అసలే కటిక చీకటి, అందులో వాన, ప్రయాణం ఎంతో ప్రయాస అయింది. ఎంతకీ దూరం తరగదు. అందరూ అలిసిపోయారు. కొంత సేపు అయాక ఆ చీకట్లో మిణుకు మిణుకు మంటూ దీపం కనిపించింది. అందరూ దానికేసి వెళ్ళారు.

అది ఒక అనాగరిక వసతిగృహం. కాని ఆ నట్టడవిలో అదైనా దొరికినందుకు సంతో షించి సైమన్ సపరివారంగా ఆ రాత్రికి అందులో బస చేశాడు. వసతిగృహ యజ మాని పెట్టిన తిండి తిని, ప్రాణాలు సొమ్మ సిల్లి ఉండటంచేత, ఎక్కడివారక్కడ పడుకుని గురకపెట్టి నిద్రకుపడ్డారు.

సైమన్ ఒక్కడూ ఒక గదిలో ఒంటరిగా పడుకున్నాడు.

ఈ వసతిగృహం అడవిదొంగల కూడలి. వసతిగృహ యజమాని దొంగలకు భాగ స్వామి. వచ్చినవారు సంపన్నులు కావటం చేత దోపిడీకి మంచి అవకాశమని దొంగలతో చెప్పటానికి వాడు అడ్డదారిన దొంగలుండే చోటికి వెళ్ళాడు.

పన్నెండుమంది దొంగలు అపరాత్రివేళ తుపాకులతోనూ కత్తులతోనూ వచ్చి సైమన్ పరివారం మీద పడ్డారు. అందరూ గాఢ నిద్రలో ఉండటంచేత ప్రతి ఒక్కడూ దొంగలచేత చచ్చాడు. తరవాత దొంగలు యథేచ్ఛగా వారిని దోచుకున్నారు.

బయట అలజడికి సైమన్ నిద్రలేచి ఏదో ప్రమాదం జరుగుతున్నదని ఊహించాడు. అతను ఏంచెయ్యాలో తెలుసుకునే లోపలనే నలుగురు దొంగలు అతని గదిలోకి జొరబడ్డారు. ఒకడు సైమన్ పైన తుపాకి పేల్చాడు. సైమన్‌కు దెబ్బ తగల్లేదు కాని, ఆ సంగతి దొంగలకు తెలిస్తే తనకు ప్రమాదమని, వాడు చప్పున కింద పడిపోయి, నిశ్చలంగా ఉండిపోయాడు.

వాడు తుపాకి దెబ్బకు చచ్చాడనుకుని దొంగలు వాడిచేతి ఉంగరాలూ, శరీరం మీద ఉన్న ఇతర ఆభరణాలూ, ఖరీదైన వాడి దుస్తులూకూడా లాగేసుకుని అక్కడి నుంచి వెళ్ళి పోయారు.

వాళ్ళకు కొంచెం వెనకనే బయలుదేరిన సైమన్‌కు ఒక్క ఉపకారం జరిగింది— అడవిలో ఉండే ఒక రహస్యమార్గం వాడికి తెలిసిపోయింది. ఆ దారిన వెళ్ళి వాడు తెల్లవారే సరికల్లా తన స్వగ్రామానికి చేరువలో



గల రహదారి చేరుకోగలిగాడు. అక్కడికి వాడి గ్రామం ఒక మైలుదూరంలో ఉన్నది.

కాని సైమన్ ఒంటిన ఒక్క చొక్కా తప్ప మరేమీ లేదు. ఆఖరుకు కాళ్ళకు పాదరక్షలుకూడా లేవు. అందుచేత వాడు చీకటి పడేదాకా ఏ పొదల్లోనో గడిపి గంపెడు చీకటి మీదవేసుకుని ఇంటికి పోదామని నిశ్చయించుకున్నాడు.

అయితే అదృష్టవశాత్తూ త్వరలోనే అక్కడికి వాడి ఊరివాళ్ళు కొందరు కట్టెలు కొట్టుకుని అడవి నుంచి ఇంటికి పోతూ అటుగా వచ్చి, "ఓరీ, సైమనువుకాదూ? నువు సేనాధిపతి పయూవన్నారే! సేనాధిపతి

గారు కాళ్ళకు చెప్పులూ, నడుముకు లాగూ కూడా లేకుండా ఇక్కడేంజేస్తున్నారబ్బా!" అని ఎద్దేవా చేశారు.

సైమన్ వారితో ప్రాధేయపూర్వకంగా, "నన్ను చూసి నవ్వటానికి ఇది సమయం కాదు. నేను మీరనుకున్నంత పనికిమాలిన వాణ్ణి కాను. దురదృష్టవశాన నన్ను దొంగలు కొట్టి నా బట్టల దగ్గిరనుంచీ లాక్కుపోయారు. నా వెంట ఉన్నవాళ్ళందర్నీ చంపేశారు. నేను ఎలాగో ప్రాణాలతో ఇవతల పడ్డాను!" అన్నాడు.

కట్టెలు కొట్టేవాళ్ళు తమకున్న దుస్తులలోనే సైమన్‌కు కూడా దుస్తులు అమర్చి, వాణ్ణి తమ బండిలోనే ఎక్కించుకుని గ్రామానికి తీసుకుపోయారు.

సైమన్ ఇల్లు చేరేటప్పటికి వాడి తండ్రి బయటికి వెళ్ళి ఉన్నాడు. తల్లి మాత్రం తన కొడుకును చూసి ఆనందబాష్పాలు రాల్చి, "ఎంత కాలమయిందిరా, నాయనా! ఎన్ని కష్టాలు పడ్డావో! పోనీలే మళ్ళీ ప్రాణాలతో ఇల్లు చేరావు, అంతే చాలు!" అన్నది. అంతలోనే ఆమెకు భర్త సంగతి జ్ఞాపకం వచ్చింది. ఆయన సైమన్‌ను చూస్తే చంపేస్తాడు. అందుచేత ఆమె తన కొడుకును వెంటనే నేలమాళిగలోకి తీసుకుపోయి అక్కడ దాచింది.



సైమన్ తండ్రి తిరిగి వస్తూనే తన పెళ్ళాం మొహం చూసి, ఏదో జరిగిందని గ్రహించి, "ఎందుకో ఏడుస్తున్నట్టున్నావే? కళ్ళు వాచి ఎర్రగా ఉన్నాయేం? ఏం జరిగింది?" అని అడిగాడు.

"అవి సంతోషపు కన్నీళ్ళు! అబ్బాయి జాడ తెలిసింది!" అన్నది భార్య.

"ఆ పనికిమాలిన వెధవ కోసం కన్నీరు కూడానా! ఈసారి నాకు అందాడో వాణ్ణి ప్రాణాలతో వదలను!" అన్నాడు సైమన్ తండ్రి కోపంగా.

ఈమాట వినగానే ఆవిడ ఈసారి నిజంగానే దుఃఖంతో కన్నీరు కార్చసాగింది. అది చూసి ఆమె భర్త, "ఏడీ వాడూ? ఎక్కడో దాచావు, చెప్పు!" అని అడిగాడు.

"వాణ్ణి ఏమీ చెయ్యనంటేనే గాని చెప్పను," అన్నది భార్య. భర్త ఆ ప్రకారం ప్రమాణాలు చేసినాకనే ఆవిడ ఆయనను నేలమాళిగలోకి తీసుకుపోయి కొడుకును చూపింది. ఆయన తన కొడుకును శిక్షించ లేదన్నమాటే గాని, వెనక చేసిన పనికి క్షమించనూలేదు.

సైమన్ తన తండ్రితో తాను చేసిన ఘన కార్యాలను గురించి చెప్పుకునేటందుకు లేదు. వాడి మాట ఆయన నమ్మడు. సపరివారంగా వచ్చి ఉన్నట్టయితే తాను రాజ





కుమార్తెను పెళ్ళాడబోతున్నట్టు తండ్రిని నమ్మించే అవకాశం ఉండేది; ఆ అవకాశాన్ని దొంగలు పొట్టన పెట్టుకున్నారు.

సైమన్‌కు తండ్రి మేకలు కాసేవాడి దుస్తులూ, కొన్ని మేకలూ ఇచ్చి రోజల్లా వాటిని కాస్తూ ఉండమని శాసించాడు. సైమన్ అలాగే చేశాడు. తనకీ గతి పట్టిందని వాడు దిగులు పడలేదు. తాను అనుకున్న గడువుకు రాకపోతే తనకోసం రాజకుమార్తె ఎలాగూ వస్తుంది. ఈలోపల వాడు బీళ్లలో మేకలను మేపుతూ, రోజల్లా వేణుగానం చేస్తూ, అప్పుడప్పుడూ మేకలకు విద్యలు నేర్పుతూ కాలం వెళ్ళబుచ్చుతున్నాడు.

అక్కడ రాజకుమార్తె సైమన్ పెట్టిన గడువు తీరిపోయేదాకా వాడి కోసం ఎదురు చూసి ఆ తరవాత తానే అతని గ్రామానికి పెద్ద పరివారంతో బయలుదేరింది. ఈ పరివారంకూడా సైమన్ వెళ్ళినదారే పట్టుకున్నది. వీళ్ళుకూడా పదోరోజు రాత్రి అదే అరణ్యం ప్రవేశించి, సైమన్ విడిది చేసిన వసతిగృహమే చేరుకున్నారు.

వాళ్ళు వచ్చిన కొద్దిసేపటికే దొంగలకు తోడుదొంగ అయిన వసతిగృహ యజమాని దొంగల ముఠా ఉండేచోటికి వెళ్ళి, "ఈసారి ఇంకా పెద్ద బేరం తగిలింది. మీరు అర్ధరాత్రి వచ్చారంటే అంతులేని బంగారమూ, ముత్యాలూ, రత్నాలూ, పట్టు దుస్తులూ కొల్లలు కొల్లలుగా దొరుకుతాయి," అని వాళ్ళతో చెప్పాడు.

వసతిగృహ యజమాని భార్య, తన భర్త దొంగలను చూడబోయిన సమయంలో, రాజకుమార్తెను సమీపించి, "తల్లీ, ఈ పాపిష్టి చోటికెందుకు వచ్చారు. నా మొగుడు అడవి దొంగలకు భాగస్వామి. కొద్దివారాల క్రితం, పాపం, ఒక యువకుడు సపరివారంగా వచ్చి ఇలాగే బసచేస్తే అర్ధరాత్రివేళ దొంగలు వచ్చిపడి అందర్నీ దోచుకున్నారు, అందరినీ చంపేశారు. అదేం

చిత్రమో ఆ యువకుడి శవంమటుకు ఎంత వెతికినా కనిపించలేదు!" అని హెచ్చరించింది. ఆమె చెప్పిన వివరాలన్నీ విని రాజకుమార్తె ఆ యువకుడు సైమన్ అయి ఉంటాడనీ, అతను ఎలాగో ప్రాణాలతో తప్పించుకోవటం చేతనే అతని శవం దొరకలేదనీ ఊహించి వసతిగృహ యజమానురాలితో, "అమ్మా, ఈ నట్టడవిలో ఈ రాత్రివేళ నేనూ, నా నౌకర్లూ ఎక్కడికి పోగలం చెప్పు. కానున్నది తప్పదుగదా! ఈ రాత్రికి మేమిక్కడే బస చేస్తాం," అన్నది.

తరవాత రాజకుమార్తె తన భటులను పిలిచి, "ఒరే, రాత్రివేళ దొంగలు వస్తారు. మీరు ఆయుధాలు తీసుకుని సిద్ధంగా ఉండండి. నిద్ర పోయినట్టు నటించండి గాని నిద్ర పోవద్దు," అని చెప్పింది.

భోజనాలు అయాక అందరూ నిద్ర పోయినట్టు నటించారు. అర్ధ రాత్రివేళ పన్నెండుమంది దొంగలూ వచ్చారు. కాని వాళ్ళు వసతిగృహంలో ప్రవేశించిన మరుక్షణం రాజకుమార్తె భటులు ఒక్కసారిగా వారిపైన పడి, ఆ పన్నెండు మందినీ, వారికి సహాయం వచ్చిన వసతి గృహయజమానినీ కూడా చంపేశారు.

మర్నాడు తెల్లవారగానే వసతి గృహ యజమాని భార్యను తన వెంటపెట్టుకుని





రాజకుమార్తె మళ్ళీ ప్రయాణం సాగించింది. వాళ్ళు త్వరలోనే సైమన్ ఉండే గ్రామం చేరుకున్నారు.

బీళ్ళమీద మేకలను మేపుకుంటున్న సైమన్ రాజకుమార్తె పరివారాన్ని అంత దూరానే చూసి, తన మేకల కొమ్ములకూ, మెడలకూ పూల దండలు చుట్టి వేణువు వాయిస్తూ రాజకుమార్తెకు ఎదురు వెళ్లాడు. మేకలు అతని పాటకు సరిగా లయవేస్తూ నడిచాయి. ఈ వింత చూడటానికి గ్రామస్థు లందరూ పోగయారు.

రాజకుమార్తెకూడా మేకలను వెంట పెట్టుకుని వచ్చే సైమన్‌ను గుర్తించింది. సైమన్ మేకలను ఆపి వాటిచేత వందన నమస్కారాలు చేయించాడు. రాజకుమార్తె వెంటవచ్చే భటులు నవ్వు ఆగక గుర్రాల పైనుంచి కింద పడిపోయారు. ఈ హాస్య ప్రదర్శనం ముగిసినాక రాజకుమార్తె భటులు ఆ బీడులోనే డేరాలు ఎత్తారు. సైమన్ మేకలను ఊళ్ళోకి తోలుకు పోయాడు. రాజకుమార్తె సైమన్ తండ్రి నడిపే వసతిగృహానికి వెళ్ళి బస కోరింది.

సైమన్ తండ్రి రాజకుమార్తెను చూడ గానే నేలపై మోకరించి, వినయంగా, తన పేద కొంప రాణివాసం వారికి నివాసయోగ్యం కాదని విన్నవించుకున్నాడు. రాజకుమార్తె ఆయనలో సైమన్ పోలికలు గుర్తించింది. ఆమె అక్కడే బసచేస్తానని పట్టుబట్టింది. సైమన్ తండ్రికి సరేననక తప్పింది కాదు.

ఆమె ఆయనతో, "అన్నట్టు నాకు నౌకరుగా ఉండటానికి ఆ మేకలు కాసే అబ్బాయి కావాలి. అతను మా నాన్నగారి వద్ద పనిచేసిన కాలంలో ఎంతో బాగా మసులుకున్నాడు," అన్నది.

"వాడా? వాడు వట్టి చవట, పనికి మాలిన వెధవ, మీబోటి వారికి సేవచేయ తగడు. వాడు ఈసారి మీ నాన్నగారి దగ్గిరికి పని కావాలని వస్తే పని ఇవ్వవద్దు సరేకదా,

మెత్తగా ముక్కలు విరగదన్నించండి!" అన్నాడు సైమన్ తండ్రి.

"అతను ఇన్నాళ్ళ తరవాత మళ్ళీ కనిపించే సరికి నాకు ఎంతో ఆనంద మయింది!" అన్నది రాజకుమార్తె.

చేసేదిలేక సైమన్ తండ్రి తన కొడుకును రాజకుమార్తె పరిచర్యలకు నియోగించాడు. ఆరాత్రి రాజకుమార్తె భోజనం చేసేటప్పుడు సైమన్ స్వయంగా వడ్డించాడు. మధ్యలో వాడి చేతినుంచి పళ్లెం కిందపడి అందులో ఉండే కప్పులూ అవీ పగిలిపోయాయి. రాజకుమార్తె విరగబడి నవ్వింది. సైమన్ తండ్రి మాత్రం వాణ్ణి ఛడామడా తిట్టాడు.

మర్నాడు ఉదయం మొహం కడుక్కునేటందుకు వేడినీరు సైమన్ కిచ్చి పంపించమని రాజకుమార్తె ఉత్తరువు చేసింది. వేడినీళ్లతో సైమన్ రాగానే ఆమె గది తలుపు మూసి, అతనిచేత తాను తెచ్చిన రాజోచితమైన దుస్తులు ధరింపజేసింది.

తరవాత ఆమె సైమన్‌తో చెయ్యీ చెయ్యీ పట్టుకుని సైమన్ తల్లి దండ్రుల వద్దకు వెళ్లింది. సైమన్ తండ్రి వారిద్దరి ముందూ మోకరించపోయాడు. రాజకుమార్తె, "అదేమిటండీ, మీ అబ్బాయినే మీరు గుర్తించలేదా?" అన్నది.

సైమన్ తండ్రి తలఎత్తి చూసి నిర్ఘాంతపోయి, "ఈ దొరవారు నా కొడుకల్లే ఉన్న మాట నిజమేగాని నా కొడుకు మాత్రం దొడ్డవాడుకాడు!" అన్నాడు.

తండ్రి పడుతున్న కంగారు చూసి సైమన్ జరిగినదంతా చెప్పేశాడు. తండ్రి అంతా విని సైమన్ చేతులు పట్టుకుని క్షమాపణ వేడుకున్నాడు.

తరవాత సైమన్‌నూ, అతని తల్లి దండ్రులనూ వెంటబెట్టుకుని రాజకుమార్తె తన దేశానికి వెళ్ళిపోయింది. అక్కడ సైమన్ రాజకుమార్తెను వైభవంగా పెళ్లాడాడు. తరవాత అంతా సుఖంగా ఉన్నారు.





# ఖలీఫా కనువిప్పు

ఖలీఫా హరూన్ అల్ రషీద్‌కు తనలాటి ఉదారుడూ, ఈవి గల దాతా ప్రపంచంలో మరొకడు ఉండబోడనే అతిశయం హెచ్చుగా ఉండేది. ఒకనాడాయన తన వజీరయిన జాఫర్ దగ్గిర తన గొప్ప సంపదను గురించి తెగ పొగడుకుని, ఎవరు ఏది కోరినా ఇవ్వగల శక్తి తన కున్నదని ప్రగల్భాలు పలికాడు. ఈశ్వరానుగ్రహం చేతనే తనకీ సంపదా, హోదా, వైభవమూ లభించా యన్నమాట ఖలీఫా పూర్తిగా మరిచిపోయాడు.

దొడ్డ బుద్ధి గల జాఫర్‌కు ఖలీఫా సంభాషణ వెగటుగా తోచింది. ఆయన ఖలీఫాతో, "ప్రభూ, ఏలినవారు ఈ దాసుడు అన్నాడని కోపగించ వద్దు. అల్లాను స్మరించి అణకువగా ఉండటమే సరి అయిన ధర్మం. భౌతిక భోగాలూ, ధర్మబుద్ధీ, సద్గుణాలూ ఈశ్వరానుగ్రహం చేత మాత్రమే లభించగలవు. వాటిని పొందిన మనిషి విర్రవీగటంలో అర్థంలేదు. చెట్లు తమ ఫలాలను చూసి విర్రవీగవు. తమ ఘనతను గొప్పగా చెప్పుకోవలిసిన వారు తమ ప్రజలు; తమ చల్లని పరిపాలన చూసి వారు ఆనందం చెందుతారు. అంతులేని సిరిసంపదలను అల్లా తమరి కొకరికే ఇచ్చాడనుకోకండి. బస్రానగరంలో ఒక సాధారణ పౌరుడున్నాడు. అతనికి గల సంపదను అంచనా కట్టటం ఎవరికీ సాధ్యంకాదు. అతనికి గల వైభోగం రాజాధిరాజులకు లేదు. అతని పేరు అబూ అల్ కాసిం. ఈవిలో తమరు కూడా అతనికి ఈడుకారు," అన్నాడు.

ఈ మాటలు వినే సరికి ఖలీఫా ముఖం జేవురించింది. ఆయన కళ్ళ నిప్పులు రాల్చుతూ, క్రోధావేశంతో, "తుచ్ఛుడా, ఇంత అబద్ధం ఆడినందుకు నీ ప్రాణం నిలువునా తీయువచ్చునే!" అన్నాడు.

జి. నాగేంద్రశర్మ



"నా మాటలలో ఒక్క పిసరైనా అస త్యం లేదు, ఏలినవారిపై ప్రమాణం చేసి చెబుతున్నాను. నేను కిందటిసారి బస్రా వెళ్ళినప్పుడు అబూ అల్ కాసిం అతిథ్యం కళ్ళారా చూశాను. నా మాటలు నమ్మకం లేనిపక్షంలో తమరు ఎవరినైనా పంపి నిజం తెలుసుకోవచ్చు," అన్నాడు వజీరు జాఫర్.

ఖలీఫా మరింత మండిపడి, తన భటు లను పిలిచి, జాఫర్‌ను ఖైదులో పెట్టించి, రుసరుసలాడుతూ తన భార్య జుబేదా వద్దకు వెళ్ళాడు. ఆయన వాలకం చూసి జుబేదా ఏం జరిగిందని అడిగింది. ఖలీఫా జాఫర్ తనకు చేసిన అవమానం చెప్పి, "ఊరూ పేరూలేని వాడెవడో నా కన్న ధనవంతుడనీ, దాత అనీ పొగడినందుకు ఆ జాఫర్‌గాడి తల తీసేయిస్తాను," అని పట్టరాని కోపంతో పరవళ్ళు తొక్కాడు.

"తొందర పడకండి. బస్రాకు ఎవరి నన్నా పంపి, జాఫర్ మాటలు అబద్ధమని రుజువయాకనే ఆయన తల తీయించ వచ్చు," అని జుబేదా ఖలీఫాను శాంత పరిచింది.

"మరెవరినో పంపటం దేనికి? నేనే వెళతాను," అన్నాడు ఖలీఫా.

ఆ ప్రకారమే ఆయన ఒక వర్తకుడిలాగా మారువేషం వేసుకుని, బాగ్దాదు నుంచి బస్రాకు ప్రయాణంచేసి ఒక సత్రంలోదిగి, సత్రం కావలివాణ్ణి అబూ అల్ కాసిం గురించి అడిగాడు.

"బాబూ, ఆయనను పొగడటానికి నూరు నోళ్ళు చాలవు. ఒక్క నోటితో నేనేం చెప్ప గలను?" అన్నాడు కావలివాడు.

ఖలీఫా ఆ రాత్రికి విశ్రమించి, మర్నాడు ఉదయం కాసిం ఇంటికి దారి అడుగుతూ బయలుదేరాడు. అబూ అల్ కాసిం ఇల్లు తెలియనివాడు చాలా దూరదేశంవాడై ఉండాలనుకుని, ఎవరో వెంట వచ్చి ఆయ నను కాసిం ఇంటి ముందు వదిలారు.



బాగ్దాదు నుంచి ఎవరో వర్తకుడు తన దర్శనం కోసం వచ్చాడని తెలియగానే అబూ అల్ కాసిం బయటికి వచ్చి తన అతిథికి స్వాగతం చెప్పి లోపలికి తీసుకుపోయాడు. కాసిం ఇల్లు బయటినుంచి చూస్తేనే ఎంతో బాగున్నది. లోపల ఇంద్ర భవనమనిపించే టట్టున్నది. ఆ ఇంట పనిచేసే బానిస లందరూ అందమైన బాలబాలికలు. వారు ఖలీఫా తాగటానికి ద్రాక్ష సారాయమూ, తినటానికి పళ్ళూ తెచ్చారు.

వారు తెచ్చిన లోటాలూ, పళ్ళాలూ కూడా అమూల్యమైనవి.




తరవాత అతిథీ, గృహస్థూ భోజనానికి కూచున్నారు. అంత రుచిగల భోజన పదార్థాలు తానెన్నడూ తినలేదని ఖలీఫా తెలుసుకున్నాడు. భోజనాలు అయాక పాట గాళ్ళు వచ్చి పాటలు పాడారు. ఖలీఫా వద్ద ఎందరో గొప్ప గాయకులున్నప్పటికీ ఈ పాటగాళ్ళ కంఠ మాధుర్యం తాను ఎన్నడూ ఎరగని సంగతి కూడా ఖలీఫా గ్రహించాడు.

ఖలీఫా గానంలో తన్మయుడై ఉన్న సమయంలో కాసిం అవతలికి వెళ్ళి, ఒక చేతిలో అంబరు కర్రా, రెండవ చేతిలో ఒక బొమ్మ చెట్టూ పట్టుకుని తిరిగి వచ్చాడు. ఆ చెట్టు బోదె వెండితో చేసినది; దానికి పచ్చలు ఆకులలాగానూ, కెంపులు పళ్ళ లాగానూ అమర్చబడి ఉన్నాయి. కాసిం ఆ చెట్టును తన అతిథి ముందు పెట్టాడు. అప్పుడు ఖలీఫాకు చెట్టుపైన ఒక బంగారు నెమలి ఉండటం కానవచ్చింది. ఆ నెమలిని ఎంతో అందంగానూ, జీవం వుట్టిపడేలా గానూ తయారు చేశారు.

కాసిం అంబరు కర్రతో నెమలి నెత్తిన తట్టగానే అది రెక్కలు పరిచి, పింఛం విప్పి విదిలిస్తూ, అతి వేగంగా గుండ్రంగా తిరగ సాగింది. అది అలా తిరిగే సమయంలో ఆ నెమలి శరీరంలోని సన్నని రంధ్రాల






నుంచి ముసాంబరం, అగరు వాసనలు వెద జల్లే ధూపాలు వెలువడ్డాయి. ఈ సువాసన హాలంతా వ్యాపించింది.

ఖలీఫాకు ఈ వినోదంలో కలిగిన అసక్తి ఇంతా అంతా కాదు. ఆయన తన్మయత్వం చెంది నెమలిని గమనిస్తూండగా, కాసిం చప్పున ఆ చెట్టును తీసుకుని అవతలికి వెళ్ళిపోయాడు.

ఖలీఫా చిరాకుపడి, "ఇదేం ప్రవర్తన? ఆతిథ్యం ఇచ్చేవాడు ఇలాటి పని చెయ్యటమా? ఈపాటి మర్యాదకూడా తెలియని కాసింను జాఫర్ ఆకాశానికెత్తాడే! నేనా చెట్టును ఇమ్మంటానని బెదిరిపోయినట్టున్నాడు, పిచ్చివాడు. వీడి ఔదార్యం పరీకించటానికి నేను స్వయంగా రావటం మంచిదే అయింది," అనుకున్నాడు.

ఇంతలో కాసిం తిరిగి వచ్చాడు. అతని వెంట ఒక బానిస కుర్రవాడు వచ్చాడు. ఆ కుర్రవాడి చేతిలో ఒక సురాపాత్ర ఉన్నది. దానిని ఒక కెంపుమలిచి తయారు చేశారు. దానిలో మేలురకం ద్రాక్ష సారాయం ఉన్నది. కాసిం ఆ పాత్రను ఖలీఫాకు అందించాడు. ఖలీఫా సారాయాన్ని నోట పోసుకుని పాత్రను తిరిగి ఇచ్చివేస్తూ, దాని నిండా ఎప్పటిలాగే సారా ఉండటం గమనించి నిర్ఘాంతపోయాడు. ఆయన తిరిగి దానిని తాగి, పాత్రనిండా మళ్ళీ సారాయం ఉండటం కళ్ళారా చూశాడు.

ఈ అక్షయ సురాపాత్రను చూసిన ఆశ్చర్యంలో ఖలీఫా నెమలిమాట పూర్తిగా మరిచిపోయి, "ఈ అద్భుతం ఎలా సాధ్యపడింది?" అని కాసింను అడిగాడు.

"ఇది ఒక గొప్ప సిద్ధుడు తయారు చేశాడు," అంటూ కాసిం, సురాపాత్రను కుర్రవాడికిచ్చి, వాణ్ణి వెంటబెట్టుకుని అవతలికి త్వరత్వరగా వెళ్ళిపోయాడు.

ఈసారి ఖలీఫాకు గొప్ప ఆగ్రహం వచ్చింది. "ఈ యువకుడు మతిమాలిన

వాడై ఉండాలి, లేదా వట్టి అడివిమృగమై ఉండాలి. లేకపోతే తన దగ్గిర ఉన్న అపూర్వ వస్తువులు ఒక్కొక్కటే తెచ్చి నాకు చూపించి, నేను వాటిని తనివిదీర చూసేలోపుగా మర్యాదలేకుండా తీసుకు పోతాడా? జాఫర్‌గాడికి రోజులు బాగాలేవు. వాడికి తగిన శాస్తి చేసి తీరుతాను," అనుకున్నాడాయన.

ఇంతలోనే కాసిం ఒక అపూర్వ సౌందర్యరాశి అయిన బానిసపిల్లను తెచ్చాడు. ఆమె ధరించిన దుస్తులనిండా రత్నాలు కుట్టి ఉన్నాయి. ఆ పిల్ల దంతంతో చేసిన కిన్నెరపైన వాయిస్తూ ఇరవైనాలుగు రకాల పాటలు పాడింది. ఆ పిల్లను చూసి, ఆమె పాట వింటూ తన్మయత్వం చెందిన ఖలీఫా, నెమలినీ, సురాపాత్రనూ మరిచి పోయి, ఆనంద పారవశ్యంలో, "అబ్బాయీ, లోకంలో అదృష్ట మంటే నీదే!" అని కాసింతో అన్నాడు.

ఈ మాట చెవిని పడగానే కాసిం ఆ పిల్లను చెయ్యి పట్టుకుని గబగబా అవతలికి తీసుకుపోయాడు.

ఈసారి ఖలీఫాకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఇక అక్కడ ఒక్క క్షణం ఉంటే ఏంచేసి పోతానో అన్న సందేహంతో ఆయన కాసిం తిరిగి రాగానే, "ఈ ఆతిథ్యానికి



ఎంతో కృతజ్ఞుణ్ణి. ఇక వెళ్ళివస్తాను. శలవు!" అన్నాడు.

కాసిం తన అతిథిని నిర్బంధంగా ఉంచ దలచక ఆయనను ముఖద్వారం దాకా సాగనంపాడు. ఖలీఫా సత్రానికి కాలి నడకను తిరిగి వస్తూ, "వీడు వట్టి డంబాచారి. తన కున్నది ప్రదర్శించాలన్న ఆత్రం తప్ప వీడిలో ఈవి ఏ కోశానాలేదు. పైపెచ్చు వీడు వట్టి పిసినిగొట్టు. ఇలాంటివాణ్ణి గురించి అబద్ధ మాడినందుకు జాఫర్ అనుభవిస్తాడు!" అనుకున్నాడు.

ఇలా అనుకుంటూ ఖలీఫా సత్రం ఆవరణలోకి వచ్చేసరికి అక్కడ అర్ధ వలయాకారంలో బానిసపిల్లలు బారుతీరి నిలబడి ఉన్నారు. వారి నడిమధ్యలో కిన్నెర వాయించిన అందగత్తె ఉన్నది. ఆమె కుడి వైపున సురాపాత్ర పట్టుకుని ఒక కుర్ర వాడూ, ఎడమపక్క నెమలి చెట్టును పట్టుకుని మరొక కుర్రవాడూ ఉన్నారు.

ఖలీఫా సమీపానికి రాగానే బానిస పిల్లలందరూ ఆయన ముందు సాష్టాంగపడి లేచి ఆయన కొక చీటీ ఇచ్చారు. అది కాసిం తన అతిథికి రాసినది. అందులో ఈ విధంగా ఉన్నది:

"తమ రాకచేత నా గృహాన్ని పావనం చేసిన అతిథీ! నేను భక్తితో పంపిన ఈ స్వల్పమైన కానుకలను స్వీకరించ ప్రార్థన. ఈ కానుకలు మీకు వేడుక గలిగించాయి గనక వాటిని మీవిగానే భావిస్తారనుకోవటానికి సాహసించాను."

ఈ చీటీ చూడగానే ఖలీఫాకు తల తిరిగి పోయినట్టయింది. తాను ఏనాడైనా ఇలాటి ఈవి ప్రదర్శించాడా? అది తనకు సాధ్యమా? ఒక్కనాటికి కాదు. ఈ యువకుణ్ణి గురించి తాను పూర్తిగా అపోహపడ్డానని, ఇతన్ని గురించి జాఫర్ చెప్పిన మాటలలో పొల్లు ఏమాత్రమూ లేదనీ ఖలీఫా గ్రహించాడు. —(సశేషం)






రామలక్ష్మణులను వెంట బెట్టుకుని విశ్వామిత్రుడు ఈశాన్య దిక్కుగా వెళ్ళి జనక మహారాజు యజ్ఞం చేస్తున్న చోటికి వెళ్లాడు. యజ్ఞశాల చుట్టూ అనేక ఋషి నివాసాలున్నాయి. విశ్వామిత్రుడు కూడా ఒక నివాసం తనకై ఏర్పాటు చేయించాడు.

ఈలోపల జనక మహారాజుకు విశ్వామిత్రుడు వచ్చినట్టు తెలిసింది. ఆయన తన పురోహితుడైన శతానందుడితో సహా వచ్చి విశ్వామిత్రుడికి అర్ఘ్యపాద్యాలిచ్చి పూజించాడు. జనక మహారాజు విశ్వామిత్రుడితో తన యజ్ఞం పూర్తికావటానికి ఇంకా పన్నెండు రోజులున్నదని చెప్పి, రామలక్ష్మణులను చూసి, "ఈ రాజపుత్రులెవరు? ఎవరి కుమార్లు?" అని అడిగాడు.

విశ్వామిత్రుడు జనకుడికి రామలక్ష్మణులను పరిచయం చేసి, "మీ వద్ద ఉండే వింటిని ఎక్కుపెట్టటం సాధ్యమవుతుందేమో చూడడానికే ఈ అబ్బాయిలు ముఖ్యంగా ఇక్కడికి వచ్చారు," అని తెలియపరిచాడు.

జనకుడి వద్ద పురోహితుడుగా ఉంటున్న శతానందుడు అహల్యా గౌతముల పెద్ద కుమారుడు. రాముడి వల్ల తన తల్లికి శాపవిమోచనం జరిగిందనీ, తన తల్లిని శపించి వెళ్ళిపోయిన తండ్రి ఆశ్రమానికి తిరిగి వచ్చాడనీ విని శతానందుడు ఎంతో సంతోషించాడు. అతను రాముడి కేసి తిరిగి, "రామా, ఈ విశ్వామిత్ర మహాముని అనుగ్రహం సంపాదించటం వల్ల నీవు ధన్యుడ



వయావు. ఈ మహనీయుడి విచిత్రగాథ చెబుతాను విను," అంటూ, అక్కడ చేరిన వారంతా వింటూండగా విశ్వామిత్రుడి జీవిత వృత్తాంతం ఈ విధంగా చెప్పసాగాడు :

బ్రహ్మదేవుడికి కుశుడనే కుమారుడు పుట్టాడు. ఆయనకు కుశనాభుడు పుట్టాడు. కుశనాభుడి కొడుకైన గాధికి విశ్వామిత్రుడు కొడుకై పుట్టి, చాలాకాలం రాజ్యంచేశాడు. ఆ కాలంలో ఆయన ఒక అక్షౌహిణి సేనను వెంట బెట్టుకుని పర్యటన చేస్తూ వసిష్ఠ మహాముని ఆశ్రమానికి వచ్చాడు. తపస్సులో నిమగ్నులై ఉండే ఋషులతో ఆ ఆశ్రమం రెండో బ్రహ్మలోకంలాగా ఉన్నది.



తన ఆశ్రమంలోకి వచ్చిన విశ్వామిత్రుడికి వసిష్ఠుడు అతిథి సత్కారాలు చేశాడు, ఇద్దరూ కుశలప్రశ్నలు వేసుకున్నారు. కొంచెంసేపు ఇష్టాగోష్ఠి జరిగాక వసిష్ఠుడు తన అతిథికి ఆయన పరివారానికి విందు చేస్తానన్నాడు. "తమ దర్శనమే నాకు గొప్ప విందు. వేరే విందు లెందుకు?" అంటూ విశ్వామిత్రుడు బయలుదేరబోయాడు. కాని వసిష్ఠుడాయనను బలవంతాన ఉంచేసి, శబల అనే తన కామధేనువును పిలిచి, భక్ష్యభోజ్యలేహ్య చోష్యపానీయాలతో అందరికీ షడ్రసోపేతమైన విందు ఏర్పాటు చేయమన్నాడు. శబల అలాగే చేసింది.

విశ్వామిత్రుడీ విందుకు ఎంతో ఆనందించి, "మహర్షీ, నాకు శబలను ఇప్పించండి. దీనికి మారుగా లక్షగోవులను ఇచ్చుకుంటాను. శ్రేష్ఠమైన వస్తువులన్నీ రాజుకే చెందాలి గనక న్యాయంగా ఈ కామధేనువు నాకే చెందాలి," అన్నాడు.

"మహారాజా, లక్ష గోవులు కాదు, నూరు కోట్ల గోవుల నిచ్చినా నేను శబల నివ్వను. ఇదే నాకున్న ధనం. మా ఆశ్రమం యావత్తూ దీనిపైనే ఆధారపడి ఉన్నది," అన్నాడు వసిష్ఠుడు.





విశ్వామిత్రుడు వసిష్ఠుడికి అడిగినంత బంగారమిస్తానన్నాడు, రత్నరాసు లిస్తానన్నాడు, శబలను ఎలాగైనా తన కివ్వమన్నాడు. వసిష్ఠుడు నిరాకరించాడు. అప్పుడు విశ్వామిత్రుడు శబలను బలాత్కారంగా తీసుకుపోవటానికి ఉద్యమించాడు.

శబల తనను పట్టవచ్చిన రాజభటులను కుమ్మి, రంకెలు వేస్తూ, కన్నీరుకారుస్తూ వచ్చి వసిష్ఠుడి కాళ్ళపైబడి, "ఏమిటీ అన్యాయం?" అన్నది.

వసిష్ఠుడు శబలతో, "విశ్వామిత్రుడు అక్షౌహిణీసేనతో వచ్చిన బలశాలి. నాకా బలంలేదు. నేనేం చేసేది?" అని అడిగాడు.

"తమ తపశ్శక్తి ముందు ఈ విశ్వామిత్రుడి బలం ఏమిటి? ఈ సేనలను సర్వనాశనం చేయగల బలాలను నేనే సృష్టిస్తాను, నాకు అనుమతి నివ్వండి," అన్నది కామధేనువు.

కామధేనువు రంకెలు వేస్తూంటే పప్లవులూ, మ్లేచ్ఛులూ అనంతంగా పుట్టుకొచ్చి విశ్వామిత్రుడి సేనలను నుగ్గుచెయ్యసాగారు. విశ్వామిత్రుడు రథమెక్కి తనకు తెలిసిన దివ్యాస్త్రాలను ఈ సేనలపై ప్రయోగించసాగాడు. కామధేనువు ఇంకా శకులనూ, కాంభోజులనూ, హారీతులనూ, కిరా



తులనూ సృష్టిస్తూనే ఉన్నది. వారు విశ్వామిత్రుడి సేనను మట్టుపెట్టేస్తున్నారు.

ఇది చూసి విశ్వామిత్రుడి కొడుకులు నూరుమంది ఆయుధాలతో వసిష్ఠుడిపైకి వెళ్ళారు. ఆయన ఒక్కసారి హుంకారం చేసేసరికి నూరుగురూ భస్మమైపోయారు. తన సేన అంతా పోయింది, నూరుగురు కొడుకులు క్షణంలో చచ్చారు. విశ్వామిత్రుడికి తీరని పరాభవం జరిగింది. ఆయన రెక్కలు విరిచిన పక్షిలాగా అయిపోయి, చావగా మిగిలిన ఒక కొడుకుపై రాజ్యభారంవేసి, హిమాలయానికి వెళ్ళి అక్కడ శివుణ్ణి గురించి తపస్సుచేశాడు.





కొంతకాలానికి శివుడు ప్రత్యక్షమై ఏమి వరం కావాలో కోరుకోమన్నాడు. దేవతలూ, గంధర్వులూ, యక్షులూ, రాక్షసులూ అధి దేవతలుగాగల అస్త్రాలన్నీ తనకు వశం కావాలనీ, సాంగోపాంగంగా ధనుర్వేద మంతా తనకు కరతలామలకం కావాలనీ విశ్వామిత్రుడు కోరాడు. శివుడు ఆయన కోరిక తీర్చి అంతర్ధానమైనాడు.

ఈ విధంగా సాధించిన అస్త్రాలతో వసిష్ఠుణ్ణి నిర్మూలించ దలిచి విశ్వామిత్రుడు వసిష్ఠాశ్రమం ప్రవేశించి, తన అస్త్రాలతో ఆశ్రమాన్ని దహించసాగాడు. అక్కడి ఋషులు చెల్లాచెదరుగా పరిగెత్తారు,



పక్షులూ, మృగాలూ పారిపోయాయి. క్షణంలో ఆశ్రమం శూన్యమైపోయింది.

వసిష్ఠుడు ఆగ్రహావేశంతో తన బ్రహ్మ దండం ఎత్తి విశ్వామిత్రుడి కెదురువచ్చాడు. విశ్వామిత్రుడు ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. వసిష్ఠుడి బ్రహ్మదండాన్ని తగలగానే అది కాస్తా చల్లారిపోయింది.

విశ్వామిత్రుడు కొన్నివందల అస్త్రాలను ప్రయోగించాడు. కాని వసిష్ఠుడి బ్రహ్మ దండం అన్నిటినీ దిగమింగేసింది. వసిష్ఠుడి బ్రహ్మదండం నుంచీ, ఆయన శరీరంనుంచీ జ్వాలలు చిమ్ముతున్నాయి, రవ్వలు లేస్తున్నాయి. ఇతర మునులు వసిష్ఠుణ్ణి సమీపించి, "ఓ మహర్షీ, విశ్వామిత్రుణ్ణి జయించావు. ఇక శాంతించు!" అని వేడారు.

"బ్రహ్మతేజోబలం ముందు క్షత్రియ బలం ఎంత? నేను తపస్సుద్వారా బ్రహ్మత్వం సంపాదిస్తాను," అనుకుని విశ్వామిత్రుడు భార్యా సమేతంగా దక్షిణదిశకు వెళ్ళి అక్కడ ఘోరమైన తపస్సుచేశాడు. ఆ సమయంలో ఆయనకు హవిష్యందుడు, మధుష్యందుడు, దృఢనేత్రుడు, మహారథుడు అనే నలుగురు కొడుకులు కలిగారు.

కొంతకాలానికి బ్రహ్మ ప్రత్యక్షమై విశ్వామిత్రుడితో, "నీ తపస్సుచేత నీకు రాజర్షి



లోకాలు స్వాధీనమైనాయి. ఇక ముందు అందరిచేతా నీవు రాజర్షివని పిలవబడతావు" అని చెప్పాడు.

రాజర్షి అనే బిరుదుతో విశ్వామిత్రుడు తృప్తి చెందలేదు. ఆయనకు బ్రహ్మర్షి అని పించుకోవాలని ఉన్నది. అందుచేత ఆయన మళ్ళీ తపస్సు సాగించాడు.

ఆ కాలంలో ఇక్ష్వాకు వంశపు రాజు త్రిశంకు అనే వాడు బొందితో స్వర్గానికి పోవాలనుకున్నాడు. ఈ కోరికను తన కుల గురువైన వసిష్ఠుడితో చెబితే, అది అసాధ్య మని ఆయన అన్నాడు. దక్షిణాన ఉంటున్న వసిష్ఠకుమారులు తనకు సహాయపడతా రేమో నని త్రిశంకు వారి వద్దకు వెళ్ళాడు. వాళ్ళు కోప్పడి త్రిశంకును వచ్చిన దారి పట్టమన్నారు. అంతటితో బుద్ధిరాక త్రిశంకు వాళ్ళను దెప్పి, మరెవరినైనా ఆశ్రయిస్తా నన్నాడు. వసిష్ఠుడి నూరుగురు కొడుకులు మండిపడి, చండాలుడివి కమ్మని అతణ్ణి శపించారు.

శాపం చేత త్రిశంకు నల్లటి ఆకారమూ, నల్లటి బట్టలూ, ఇనప సొమ్ములూ కలిగిన వాడై వసిష్ఠుడి గర్భశత్రువైన విశ్వామిత్రుణ్ణి ఆశ్రయించాడు. విశ్వామిత్రుడు త్రిశంకు చెప్పినదంతా విని, "నిన్ను ఈ ఆకారంతోటే



స్వర్గానికి పంపుతాను," అని మాట ఇచ్చాడు. ఆయన యజ్ఞం తలపెట్టి, అందుకు ఋషుల నందరినీ పిలుచుకు రమ్మని తన శిష్యులను పంపాడు.

ఆహ్వానాలు అందుకుని అందరూ వచ్చారుగాని, మహోదయుడనేవాడూ, విశ్వామిత్రుడి కొడుకులూ రాలేదు. రాని వారిని విశ్వామిత్రుడు ఘోరంగా శపించాడు.

యజ్ఞం ఆరంభమయింది. కాని హవిస్సులు తీసుకోవటానికి దేవతలు రాలేదు. విశ్వామిత్రుడికి మండిపోయింది. ఆయన త్రిశంకుతో, "నే నింతకాలం తపస్సు చేసి సంపాదించిన శక్తితోనే నిన్ను స్వర్గానికి



పంపుతాను," అన్నాడు. మునులందరూ చూస్తుండగానే త్రిశంకు తన శరీరంతోనే పైకి లేచి స్వర్గానికి వెళ్ళిపోయాడు.

అయితే ఇంద్రాది దేవతలు త్రిశంకును స్వర్గానికి రానివ్వక, అతన్ని కిందికి తోసేశారు. త్రిశంకు తలకిందుగా పడిపోతూ, "మహాత్మా, రక్షించు!" అని అరిచాడు. విశ్వామిత్రుడు కోపావేశంతో దక్షిణదిక్కున మరొక సప్తర్షి మండలాన్ని, కొత్త నక్షత్రాలనూ సృష్టించి, "ఇంకొక స్వర్గాన్నీ, కొత్త దేవతలనూ కూడా సృష్టిస్తాను," అన్నాడు.

అప్పుడు దేవతలూ, ఋషులూ భయపడి విశ్వామిత్రుడి వద్దకు వచ్చి, "మహాను



భావా, శాపగ్రస్తుడైన త్రిశంకును స్వర్గంలో ఎలా ఉంచటం?" అని అడిగారు.

"ఇతణ్ణి బొందితో స్వర్గానికి పంపుతానని మాట ఇచ్చాను. అది జరిగితీరాలి," అన్నాడు విశ్వామిత్రుడు.

త్రిశంకు కొత్తగా సృష్టి అయిన నక్షత్రాల మధ్య తలకిందులై శాశ్వతంగా ఉండిపోయేటట్టూ, విశ్వామిత్రుడు కొత్త దేవతలను సృష్టించే ప్రయత్నం మానుకునేటట్టూ ఏర్పాటు జరిగింది.

తరవాత విశ్వామిత్రుడు దక్షిణాన్ని వదిలిపెట్టి, పడమరగా ఉన్న పుష్కరమనే పెద్ద తపోవనానికి వెళ్ళి అక్కడ తపస్సు ప్రారంభించాడు.

ఈ సమయంలో అయోధ్యలో అంబరీష మహారాజు ఒక యజ్ఞాన్ని ప్రారంభించగా, ఇంద్రుడు యజ్ఞపశువును ఎత్తుకుపోయాడు. అప్పుడు రాజపురోహితుడు యజ్ఞపశువును ఎలాగైనా సంపాదించాలనీ, అది దొరకక్కపోతే నరపశువును బలి ఇవ్వవలిసి ఉంటుందనీ రాజుతో చెప్పాడు. యజ్ఞపశువు దొరకక్కపోవటంచేత అంబరీషుడు నరపశువుకోసం బయలుదేరాడు.

భృగుతుంద మనే కొండప్రాంతంలో ఋచీకుడనే ముని తన భార్యా బిడ్డలతో

ఉంటున్నాడు. అంబరీషుడు ఆయన వద్దకు పోయి తన కథ చెప్పి, "లక్ష గోవులిస్తాను, మీ కొడుకులలో ఒకణ్ణి యజ్ఞపశువుగా ఇవ్వండి," అని ప్రార్థించాడు. పెద్దవాణ్ణి ఇవ్వనన్నాడు ఋచీకుడు. ఆఖరువాణ్ణి ఇవ్వనన్నది ఋచీకుడి భార్య. శునశ్శేపు డనే వాడు రెండోవాడు. వాడు రాజుతో, "మా అమ్మా, నాన్నా నన్ను అమ్మటానికి సిద్ధంగా ఉన్నారని వేరే చెప్పనవసరం లేదు. నన్ను మీ వెంట యజ్ఞపశువుగా తీసుకుపొండి," అన్నాడు.

అంబరీషుడు శునశ్శేపుణ్ణి వెంటబెట్టుకుని మిట్టమధ్యాన్నానికి ఎండదెబ్బ తిని విశ్వామిత్రుడి ఆశ్రమం చేరుకున్నాడు. శునశ్శేపుడు విశ్వామిత్రుణ్ణి చూస్తూనే ఆయన ఒళ్ళో పడి, తన కథ చెప్పుకుని, తనను కాపాడమని ఏడ్చాడు.

విశ్వామిత్రుడు వాణ్ణి చూసి జాలిపడి తన నలుగురు కొడుకులతో, "వీడికి బదులుగా మీరు యజ్ఞపశువులై వీణ్ణి కాపాడండి," అన్నాడు. వాళ్ళు తండ్రిని లక్ష్యపెట్టక ఆయన మాట నిరాకరించారు. విశ్వామిత్రుడు మండిపడి తన కొడుకులను కూడా వసిష్ఠుడి కొడుకులను శపించినట్టే శపించాడు.

తరవాత విశ్వామిత్రుడు శునశ్శేపుడికి రెండు మంత్రాలు ఉపదేశించి, "నిన్ను యజ్ఞపశువును చేసి యూపస్తంభానికి కట్టినప్పుడు ఈ మంత్రాలు చదివితే అగ్నిహోత్రుడు నీకు సుముఖుడవుతాడు," అని చెప్పాడు.

అలాగే జరిగిందికూడా. అంబరీషుడి యజ్ఞంలో శునశ్శేపుడికి ఎర్ర గంధం పూసి, ఎర్రబట్టలు కట్టి, దర్భలతో యూపస్తంభానికి కట్టారు. అప్పుడు వాడు తన మనసులో రెండు మంత్రాలూ జపించుకున్నాడు. ఇంద్రుడు వాడికి ప్రత్యక్షమై దీర్ఘాయువునిచ్చాడు.



# దిల్వారా జైనాలయాలు

ఆరావళీ పర్వతపంక్తిలో అబూ శిఖరంపై ఉన్న దిల్వారా జైనాలయాలు చాలా ప్రసిద్ధమైనవి. ఇవి సముద్ర మట్టానికి 4000 అడుగుల ఎత్తున ఉన్నవి. పాలరాతితో నిర్మించిన ఈ ఆలయాలలో మధ్యయుగపు శిల్ప ప్రతిభ యావత్తూ ఇమిడి ఉన్నది. (ఆలయం కప్పు శిల్పం బొమ్మలో చూడండి.)

ఈ ఆలయాలలో మధ్యనున్నది చతురస్రాకారంగలది. ఇందులో చతుర్ముఖుడైన ఆది నాధుడి విగ్రహం ఉన్నది. దీనికి ఉత్తరంగా ఉండే ఆలయంలో కూడా ఈ దేవుడే ఉన్నాడు. పడమరగా విమల్ షా అనేవాడు కట్టించిన ఆలయం ఉన్నది. ఇది పార్శ్వనాధాలయం. దీని సరసనే ఉన్న ఆలయంలో నేమినాథ్ విగ్రహం ఉన్నది.

అబూ వద్ద ఈ ఆలయాలే గాక హిందువులకు పవిత్రమైన పుణ్యప్రదేశాలు చాలా ఉన్నాయి. దీనికి తోడు ఇక్కడి ప్రకృతి శోభకూడా ప్రసిద్ధమైనది. అందుకే ఇక్కడికి యాత్రికులు ఎడతెగక వస్తూంటారు.






1. తాడూరి దుర్గాప్రసాద్, తాడేపల్లిగూడెం
చక్కని చిత్రాలను చిత్రించే "చిత్ర" గారి అసలు నామధేయమేమిటండీ?
టి. వి. రాఘవన్.

2. ఎ. రాఘవేంద్రరావు, పుదుక్కోటై
"మనదేశపు అద్భుతాలు" శీర్షికపై మేముకూడ వివైన వ్రాసి, ఫొటోతో పంపవచ్చునా?
ఎందు కంత శ్రమ?

3. ఎం. రామ్‌కిషన్, బొల్లొకొండ
అన్నయ్యా, "చందమామ"కు చెత్తబుట్ట వుందా?
పెద్దదే ఉంది, తమ్ముడూ.

4. ఎన్. నాగేశ్వరరావు, ఏలేశ్వరము
నా వద్ద "పూర్వగాథాలహరి" వుంది. అందుండి మేము కథలు పంపవచ్చా?
అది మా దగ్గరకూడా ఉంది.

5. యర్ర రామారావు, శగున్ బగాన్
"చందమామ" చిత్రకారులు వడ్డాది పాపయ్య, శంకర్, చిత్ర, ఎం. టి. వి. అచార్యలు రాసిన చిత్ర పటముల వలననే అభివృద్ధిలోకి వస్తుంది అని నేనంటూ యున్నాను. మీరేమంటారు?
కథలుకూడా బాగున్నట్టు పాఠకులు అడపాదడపా మాకు రాస్తూనే ఉన్నారు మరి.

6. కుమారి నరహరి శెట్టి గీతా కెప్టెన్ స్వరాజ్యలక్ష్మి, కూనవరం
చందమామ అన్నయ్యా, మేము ఎన్ని ఉత్తరాలు రాసినా జవాబు ఇవ్వరు, ఈ ఉత్తరానికైనా జవాబు ఇస్తారని ఆశిస్తున్నాము.
జవాబివ్వటానికి నీ ప్రశ్న ఏమిటో తెలియలేదు, బుల్లెమ్మా!

7. కుమారి ఆరాధుల పద్మ, చెన్నూరు

చందమామయ్యా, 1962 లో ఏదో పెద్ద ప్రళయం ప్రపంచాన్ని ముంచేస్తుం దన్నారు, నిజమేనా?

జరిగిన దాని నిజానిజాలు చెప్పవచ్చుగాని జరగబోయేదాని మాట ఎలా చెప్పటం? అయినా 1962 మాటగద!

8. యల్. బాల్‌రాం, కోడంగల్

అన్నయ్యా, కర్ణుడు తన రథాన్ని లాగుకొనుటకు రెండు గడియల వ్యవధి అడిగినప్పటికిని అర్జునుడు కర్ణుణ్ణి చంపటం కొంత అన్యాయమేనని అనుకుంటాను, మరి మీరు?

అదే పొరపాటు! రాజకీయాల్లో "కొంత" అన్యాయమనేది లేదు. మనం కౌరవుల పక్షమైతే అర్జునుడు చేసింది శుద్ధ అన్యాయం; పాండవుల పక్షమైతే పూర్తిగాన్యాయం!

9. జొన్నలగడ్డ సత్యన్నారాయణ, తాడేపల్లిగూడెం

అన్నయ్యా, "చందమామ"కి నేనొక మంచి కథరాసి పంపాలనుకుంటు న్నాను. చంద్రునికో నూలు పోగులాగ అన్ని కథలలో నా చిన్న కథకూడా ఒకటి ప్రచురించవూ?

పంపేదేదో మంచిదే పంపు. నూలు పోగుల్లాంటి కథలు పాఠకులకు నచ్చకపోవచ్చు.

10. కే. బి. బాబురావు, సికింద్రాబాదు

"బాలకాండ"లో రాముడు తాటకి చేతులూ తెగగొట్టాడు, లక్ష్మణుడు ముక్కు, చెవి కోసివేశాడు అని వ్రాసినారు, కాని తాటక చచ్చిపడియున్న చిత్రములో అన్ని అవయవాలు సరిగానే యున్నాయి, కారణం?

బొమ్మను మరీ భీభత్సంగా వెయ్యటం ఇష్టంలేక మా ఆర్టిస్టు కావాలనే అలా వేశారు.

11. కమ్మిలి భానుమతి, మచిలీపట్నం

అన్నయ్యా, నాకు కథలెన్నో తెలుసు. "చందమామ"లో ప్రచురించుద మంటే కథలతోపాటు చిత్రములుకూడా పంపవలెనేమో అను సందేహము వచ్చినది—

ఏమీ అవసరం లేదు. "చందమామ"కు మంచి చిత్రకారులున్నారు.

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

అండగా కాళ్లుండగా

పంపినవారు:
ఎస్. సి. గురుమూర్తి, చెన్నూరు.

Photo by Madan Gopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

రైలెందుకు దండుగా!

పంపినవారు:
ఎన్. సి. గురుమూర్తి, చెన్నూరు.

# అట్టచివరి బొమ్మ

శకుని యుద్ధరంగం నుంచి పారిపోయినట్టే పోయి తన అశ్వదళంతో ధృష్టద్యుమ్నుడి సేన యొక్క పార్శ్వంపైన పడ్డాడు. తిరిగి యుద్ధ జ్వాలలు లేచాయి. శకుని వెంట ఉన్న అశ్వ దళంలో చాలా భాగం నాశనమై, ఏడువందల అశ్వికులే మిగిలారు.

సముద్రమంత కౌరవ సైన్యం గోష్పాదమంత అయింది. అర్జునుడు దానిని తుడిచిపెట్ట సాగాడు. ఉభయ పక్షాల చావగా మిగిలిన యోధుల మధ్య తీవ్ర పోరాటం జరిగింది. అందులో దుర్యోధనుడు దెబ్బ తిని, విరథుడై, ఒక గుర్రమెక్కి దూరంగా వెళ్ళిపోయాడు.

కృతవర్మ కృపాశ్వత్థామలూ, శకునీ ఒక చోట చేరి, సంజయుణ్ణి కూడా తమ వెంట అయిదవ యోధుడుగా పెట్టుకుని పాండవ సైన్యంతో పోరసాగారు. కాని సాత్యకి వారిని తలపడి, సంజయుణ్ణి మూర్ఛపోగొట్టి ప్రాణాలతో పట్టుకున్నాడు.

ఇంకొకవంక ధృతరాష్ట్రుడి కొడుకులలో చావగా మిగిలినవాళ్ళు భీముణ్ణి ఎదిరించి, అతని చేతిలో అందరూ చచ్చారు. ఒక్క సుదర్శనుడనేవాడు మాత్రం మిగిలాడు.

కృష్ణార్జునులు ఈ దశలో మిగిలి ఉన్న కౌరవబలాల లెక్కలు కట్టారు. దుర్యోధనుడి బలాలలో ఇంకా అయిదువందల గుర్రాలూ, రెండువందల రథాలూ, ఒకవంద ఏనుగులూ, మూడువేలమంది పదాతులూ మిగిలారు. యోధులలో దుర్యోధనుడూ, సుదర్శనుడూ కాక కృపాశ్వత్థామలూ, కృతవర్మా, సుశర్మా, శకునీ, అతని కొడుకు ఉలూకుడూ మిగిలారు. భీమార్జున సహదేవులు ఈ యోధుల నెదిరించారు. ఆ యుద్ధంలో అర్జునుడు సుశర్మను చంపాడు. భీముడు సుదర్శనుడి తల తెగవేశాడు. శకునినీ, ఉలూకుణ్ణీ సహదేవుడు చంపాడు. మరిరెండు ఘడియలలో దుర్యోధనుడి సైనిక బలాలన్నీ నిశ్శేషమయాయి.

పద్దెనిమిదవ రోజున భారత యుద్ధం ముగిసింది. కౌరవసైన్యం పూర్తిగా నాశనమయ్యే నరికి పాండవులకు మిగిలిన బలాలు: రెండువేల రథాలు, ఏడువందల ఏనుగులు, అయిదు వందల గుర్రాలు, పదివేల పదాతులు. శత్రుశేషాన్ని నిర్మూలించుకుంటూ యుద్ధరంగంలో తిరుగుతున్న ధృష్టద్యుమ్నుడు సాత్యకి వెంట బందీగా ఉన్న సంజయుణ్ణి చూసి, "వీణ్ణి ఎందుకు పట్టుకున్నావు ? చంపెయ్యి !" అన్నాడు. సాత్యకి సంజయుణ్ణి చంపబోతుండగా వ్యాసుడు వచ్చి విడిపించాడు.

సంజయుడు ఆయుధాలూ, కవచమూ తీసేసి నగరానికి పోతూ ఒక పెద్ద మడుగు దగ్గిర గదాహస్తుడై కంట తడిపెట్టుతూ కూర్చుని ఉన్న దుర్యోధనుణ్ణి చూశాడు. దుర్యోధనుడు సంజయుణ్ణి ప్రశ్నించి, తన పక్షాన కృప కృతవర్మాశ్వత్థామలు మాత్రం మిగిలినట్టు తెలుసుకున్నాడు. "సంజయా, అపజయంపొంది నా బోటి వాడు జీవించి ఉండలేడు. నే నింకా ప్రాణాలతో ఉన్నానని మా తండ్రితో చెప్పు," అంటూ దుర్యోధనుడు మడుగులోకి దిగిపోయాడు.

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వాఖ్యలు 1961 నవంబరు సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబరు నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## సెప్టెంబరు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అండగా కాళ్ళుండగా

రెండవ ఫోటో : రైలెందుకు దండుగా !

పంపినవారు : ఎస్. సి. గురుమూర్తి,

చెన్నూరు (P.O.) కడప జిల్లా.

బహుమతిమొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు. ఆడుకునేందుకు తోటకు వెళుతూండగా ఒక కొంటెకుర్రాడు సైకిలు ఎక్కి వచ్చి, "మీ టైగర్ మొన్న నా సైకిల్ టైరు కొరికి పాడుచేసింది. నష్టం ఎవరిస్తారు?" అన్నాడు. "టైగర్‌నే అడుగు!" అన్నారు దాసూ వాసూలు. కొంటెకుర్రాడు 'టైగర్'ను పట్టుకునేందుకు చూశాడు. అది అందకుండా పరిగెత్తసాగింది. కొంటెకుర్రాడు దాని వెనక వేగంగా సైకిల్ తొక్కసాగాడు. 'టైగర్' పరిగెత్తి పరిగెత్తి ఎదురుగా వున్న ఒక చెట్టుకొమ్మ మీదికి ఎగిరింది. కొంటెకుర్రాడు ఆ వేగంలో పోయి చెట్టుబోదెకు ఢీ కొట్టాడు. సైకిల్ చక్రం వూడి దూరంగా వెళ్లి పడింది. దాసూవాసూలు నవ్వుకున్నారు.






**Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'**

# సూపర్ ఫాస్ఫేటు

అంటే మీయొక్క భూములనుండి

## అధిక పంటను

## అధిక తరము

## అధిక ఆదాయము

అమోఘమైన
ఉత్పత్తిని యిచ్చునది




సందేహించకండి— సూపర్ ఫాస్ఫేటు ఉపయోగించండి

సదరన్ రీజయనల్ కమిటి
ఫెర్టిలైజర్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా P.B. No. 12, మద్రాసు—1.

వాళ్ళను
ఎల్లప్పుడూ
ఉత్సాహంగా
వుంచటానికి



Nutrine
Sweets



న్యూట్రిన్ కన్ఫెక్షనెరీ కంపెని ప్రైవేట్ లిమిటెడ్
చిత్తూరు, ఆంధ్రప్రదేశ్.

NC-59

---




# అమర్‌జ్యోతి ఫాబ్రిక్స్

చేనేత బెడ్‌షీట్లలో గొప్ప పేరు

బెడ్‌షీట్లు - కర్టెన్ గుడ్డలు తువాళ్లు
మొదలగునవి...

ప్రపంచమంతటికి ఎగుమతి అగుచున్నవి

బ్రాంచీలు :
బొంబాయి,
మద్రాసు,
ఢిల్లీ.

తయారు చేయువారు: అమర్‌జ్యోతి ఫాబ్రిక్స్
పోస్టు బాక్సు 22, కరూర్ (ద. ఇ.)
మద్రాసు ప్రభుత్వమువారి ప్రథమ బహుమతి పొందినది.

91

